శ్రీ

# నాడీపరిజ్ఞానము

ఇత్యాది

రాజమహేంద్రపుర వాస్తవ్యులగు

శ్రీమదళిహారతిరుమల మాడభూషి

శ్రీనివాసాచార్యులు అయ్యవారలుగారిచే

రచియింపఁబడి

వం. పెద్దు లత్సయ్యగారిచే

ప్రకటింపఁబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు

రాయవరము

శ్రీ మేరీముద్రాలయమున మల్లిడి సత్తిరెడ్డిగారిచే ముద్రితము.

1926

 [దీని వెల 0—8—0

శ్రీరామాయ నమః

శ్రీలక్ష్మీనారాయణ పరబ్రహ్మణేనమః

శ్రీధన్వంతరయేనమః

శ్రీనివాస ధన్వంతరీయములోని

# నాడీ పరిజ్ఞానము



## ప్రథమ భాగము

౧. శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామి సంక్షిప్తం సూక్తముత్తమం। ఆయుర్వేదోప దేశోస్మిన్ జ్వరాణాంచనిగద్యతే॥ అర్థము. అథాతః-- అటుపిమ్మటను, సంక్షేపం--సంగ్రహముగను, సూక్తం--మంచిమాటలుగను, ఉత్తమం--యోగ్యమయినదిగను, ఆయుర్వేదే--ఆయుర్వేదమనెడు వైద్యశాస్త్రమునందు, ఉపదేశం--చెప్పబడిన యర్థములను, అస్మిన్--ఇప్పుడు, జ్వరాణాం--జ్వరములయొక్క నిదానములను, సంప్రవక్ష్యామి--తెలుపగా చెప్పుచున్నాను.

౨. శ్లో॥ నానామునీనాం వచనైరిదానీం సమానతస్సద్భిషజాభియోగాత్ । సోపద్రవారిష్టనిదానలింగాన్నిగద్యతే దోషవినిశ్చయాయం ॥అర్థము॥ ఇదానీం-ఇప్పుడు, నానామునీనాం-పలువురైనమునులయొక్క, వచనైః-వాక్యములచేతను,సద్భిషజాభియోగాత్-యోగ్యులై యనుభవనీయులగు వైద్యశిఖామణులవలన చెప్పబడిన యోగములవలనను, సోపద్రవ-ఉపద్రవములతో కూడినట్టియు, అరిష్ట-అరిష్టకరములైనట్టియు, రోగములయొక్క నిదానముచే నాయారోగముల స్వరూపములున్ను దోషములున్ను చెప్పబడుచున్నవి.

౩. శ్లో॥ నానాతన్త్రవిహీనానాం భిషజామల్పమేధసాం। సుఖం విజ్ఞాతుమాతంక మయమేవ భవిష్యతి ॥అ॥ నానాతన్త్రవిహీనానాం-పలువిధములయిన శాస్త్రములు నెఱుంగకున్ను, తంత్రములయందున్ను అల్పప్రజ్ఞగల వైద్యులకు రోగనిదానవిషయమై సంకోచములు గలుగుచుండును గాన ఇట్టిలోపములను తొలగించుటకుగాను సుఖముగ తెలియుటకును శాస్త్రతత్వ సంగ్రహము చెప్పబడుచున్నది.

౪. శ్లో॥ జ్వరో రోగపతిః పాప్మా మృత్యుర్కరాంతకః। క్రోధ దక్షాధ్వరహృద్రుద్రోర్ధ్వనయనోద్భవం। సంజాయతేష్టధా రోగైః పృథఙ్మిశ్రసమాగతైః। ఆగంతుశ్చతుర స్తత్రైవైకో దేవః ప్రకాశితైః మిథ్యాహార విహారాభ్యాం దోషాభ్యాయిలె యాస్సృతః। బహిర్మార్గస్య కోష్ఠస్య వహ్నిర్జ్వరదాస్యరసానుగాః ॥అ॥ జ్వరము సర్వరోగముల కధిపతియగుట యే గాక పాపస్వరూపము కలదియు, మృత్యుస్వరూపము గలదియు శరీరకాంతిని స్వరూపముగా గలిగి యమస్వరూపమును ధరించినదై కోపించి దక్షయజ్ఞమును పాడుచేసిన శివుని లలాటనేత్రమునుండి పుట్టి యెనిమిది విధములయిన దోషములతో కూడి వేరై పట్టియు కూడుకొని యున్నట్టియు రాకడలచేత వచ్చెడు ఆగంతుకజ్వరములు నాలుగువిధములుగ నుండును. అందు మొదటిది దుష్టదోషయుక్తమయి ప్రకట దూషణాలవలన వచ్చును. రెండవది అసత్యము లాడుటవలన గలుగును. మూడవది తాను భుజించెడు ఆహారపదార్థముల సంయోగము వలన జనించును. నాలుగవది మితిమీఱి భుజించుట పాటుపడుట మొదలగువాని వలన దోషమిళితమై పుట్టును. ఇయ్యది బాహ్యమున నిరసనము నొంది జఠరమందుండు అగ్నిరస భోజనరసాదుల ననుసరించి జ్వరరూపమాయెను.

౫. శ్లో॥ స్వేదావరోధ సర్వాంగం గ్రహాణం తథా। యుగపద్యత్ర దృశ్యన్తే పూర్వ చిహ్నం జ్వరస్యచ॥ ॥అ॥ శరీరమున చెమట పుట్టకుం

డుట శ్వాసము గలిగియుండుట శరీర మంతటను నొప్పులు గలిగియుండుట మొదలగునవి యొక్కసారిగ నెవరిదేహమున గానవచ్చునో అప్పుడు జ్వరమువచ్చుటకు మొదటిలక్షణ మని యెఱుగవలెను.

౬. శ్లో॥ సామాన్యతో విశేషేణ జృంభాత్యర్థంసమీరణాత్। పిత్తాన్నయనయోర్దాహః కఫాదన్నారుచి స్తథా ॥అ॥ సామాన్య విశేష రూపములచే చెప్పుచున్నాడు వాతములవలనబుట్టు రోగమునకు ఆవలింతలు విశేషముగ గలిగియుండును. పయిత్యరోగమునకు రెండు కన్నులును మంటగలిగియుండును శ్లేష్మరోగమునకు అన్నిపదార్థములందును అరుచి కలిగియుండును.

౭. శ్లో। సర్వలింగే సమూ వాయుస్సర్వదోషప్రకోపజే। రూపైస్స్వైశ్వేతరాభ్యాంతు సంసృతం ద్వంద్వజంవిదుః ॥అ॥ సర్వశరీరములకును వాయువుతో గూడుకొని సర్వదోషములును ప్రకోపించి పైత్య శ్లేష్మ సంబంధములయిన రూపములను గలిసియున్నయెడల సంసర్గగలిగి ద్వంద్వజ్వరము లగును.

౮. శ్లో॥ ఆదౌ సమస్తరోగేషు అష్టస్థానాన్పరీక్షయేత్। నాడీస్పర్శంచ రూపంచ శబ్దనేత్రపురీషయోః। మూత్రవర్ణంచ జిహ్వాచ ఏతాదృశభిషగ్వరైః ॥అ॥ ప్రథమమున సర్వరోగములకును ఎనిమిదిస్థానములను పరీక్షించవలెను. అవి యెట్లనగా:—హస్తములు, పాదములు, మొదలగువానియందు చలించు నాడులును, దేహస్పర్శము, రూపము, శబ్దము, నేత్రములు, పురీషము, మూత్రముయొక్క వర్ణము, నాలుకయును,

౯. శ్లో॥ కరమూలే పాదమూలేచ, నాడీవహంతి దృశ్యతాత్। నారీణాం వామభాగేచ పుంసాం దక్షిణేతు శోధయేత్ ॥అ॥ మణికట్టునందును, పాదమూలములయందును నాడి కదలుచుండును గాన స్త్రీల కెడమభాగమందును, పురుషులకు కుడిపార్శ్వమందును పరీక్షించవలె

ను. ఇగాను కొందరు వైద్యశిఖామణులు గళపార్శ్వములను నాభి కిరు పార్శ్వములను గూడ పరీక్షించెదరు.

### మతాంతరము

౧౦. వామభాగే స్త్రీయోనాడీ పురుషస్యతు దక్షిణె। యథా నాడీ తథాశ్చర్యా విజ్ఞేయం వైద్యపారగైః ॥అ॥ స్త్రీల కెడమచేతి మూలమందును, పురుషులకు కుడిచేతిమూలమందును యేరోగసంబంధమయిన నాడి నారోగక్రమమున నడచును గాన వైద్యశాస్త్రజ్ఞుల చేత తెలియబడవలెను.

### నాడుల స్థాననిర్ణయము

౧౧. అంగుష్టమూలమాశ్రిత్య త్రిభిరంగుళిభిః శితః। యవస్యబీజమాత్రంచ నాడిస్సర్వాంగసంగతిః। వాతపిత్తద్వయోర్మధ్యే నాడీ కఫగత స్తథా ॥అ॥ బొటనవ్రేలు నాశ్రయించి మూడువ్రేళ్ల చేతనుపట్టిచూచెది. యవగింజ ప్రమాణము నాడి కదులుచు సర్వాంగములందును వ్యాపించి యుండును. వాతపైత్యనాడులు మొదలివ్రేళ్ళు అనగా తర్జని యనామికల క్రిందను, శ్లేష్మనాడి మధ్యవ్రేలి క్రిందను నడచుచుండును.

### త్రినాడీలక్షణము

౧౨. వాతేవక్రగతా నాడీ చపలాపిత్తవాహినీ। స్థిరా శ్లేష్మయుతా నాడీమిశ్రితా ద్వంద్వజాభవేత్ ॥అ॥ వాతనాడి వంకరగను పైత్యనాడి చపలముగను శ్లేష్మనాడి స్థిరముగను ద్వంద్వనాడి ఘడియ స్థిరముగను మరియొకఘడియ అస్థిరముగను, చపలముగను, మరి యొకఘడియ వక్రముగను నడచుచుండును.

### వాతనాడీలక్షణము

౧౩. వాతేవక్రగతిర్నాడీ కాలావుకహంసవత్తథా। బాలస్యదోలికా సైపజలూకాశ్చగతిర్భవేత్ ॥అ॥ వాతనాడికప్పవలెను.లావుక, తిత్తిరిపిట్ట వలెనుహంసవలెను, బాలురనూచునుయ్యాలవలెను,జలగవలెనునడచును.

## పైత్యనాడీలక్షణము

౧౪. చపలాపిత్తగానాడీ యథామయూరవద్భవేత్ ॥ సురా శస్య గతిర్నాడి కపోతగతివత్తథా ॥అ॥ పైత్యనాడి నెమలివలెను, హంసవలెను, గువ్వవలెను, నడచును

## శ్లేష్మనాడీలక్షణము

౧౫. కఫాస్థిరగతిప్రోక్తా కుక్కుటస్య గతిస్థథా । పారావతస్య నాడీటిట్టిభసంజ్ఞవత్ ॥అ॥ శ్లేష్మనాడి స్థిరగతియని చెప్పఁబడినది. అది కోడివలెను, పావురమువలెను, బండివలెను, తీతువపిట్టవలెను, నడచును.

## వాతశ్లేష్మనాడీలక్షణము

౧౬. ముహుర్లావుకగా నాడీముహూర్నాడి జలూకవత్ వాతశ్లేష్మగతిర్జ్ఞేయం వైద్యవిద్యావిశారదైః ॥అ॥ మాటిమాటికి లావుకపిట్టవలెను, జలగవలెను, నడచు నాడి వాతశ్లేష్మనాడియని తెలియువలెను.

## వాతపైత్యనాడీలక్షణము

౧౭. ముహుర్లావుకకా నాడీ ముహూర్నాడి మయూరవత్। వాతపిత్తద్వయం ప్రాహుస్థద్విజానాతి పండితః ॥అ॥ తొలుత లావుకపిట్టవలె నడిచి పిమ్మట నెమలివలె నడిచెనా వాతపైత్యనాడి యని వైద్యులు గ్రహింతురు.

## శ్లేష్మవాతనాడీలక్షణము

౧౮. కుక్కుటస్యగతిర్నాడీ ముహుర్నాడి జలూకవత్ । వాతశ్లేష్మగతిర్జ్ఞేయం వైద్యవిద్యావిశారదైః ॥అ॥ ప్రథమమున కోడివలె నడిచి పిమ్మట జలగవలె నడచెనా వాతశ్లేష్మనాడి యని యెరుంగునది.

## శ్లేష్మపైత్యనాడీలక్షణము

౧౯. ముహుర్భేకగతిర్నాడీ ముహుర్మండూకవద్భవేత్। శ్లేష్మపిత్తగతిః ప్రాహుర్వైజాపియం భిషగ్వరైః॥ అదిని పామువలె నడచి తరువాత కప్పవలె నడచెనా శ్లేష్మపైత్యనాడియని తెలిసేది.

## అజీర్ణనాడ్యాదిలక్షణము

౨౦. అజీర్ణే భగతిర్నాడీ జీర్ణే చస్వాపకాకవత్ । సుప్తకాకవత్ స్త్రీ వాహాన్ స్త్రీసంగమేసతి । హంసవద్ద్రుత శే నాడీ మలబద్ధం విజానయేత్ ॥అ॥ అజీర్ణనాడి యేనుగవలె నడచును. అజీర్ణనాడి నిద్ర బోయిన కాకివలె నడచును. స్త్రీసంగమనాడియు నిద్రబోయిన కాకివలెనే తీవ్రముగా నడచును. హంసవలెగాని తుమ్మెదవలెగాని నడచినా మలబద్ధనాడియని యెరుంగునది.

## సంశయనాడీలక్షణము

౨౧. సద్యస్నాతస్యభుక్తస్యక్షుత్తృష్ణాతపశీలినా । వ్యాయామశ్రాంతదేహేచ భూతావేశశ్చరోదనె । సుందరీణాంచ సంయోగే మద్యపాన మతిభ్రమః । గాంధారీ భక్షణాశ్చైవ పవనాభ్యాససాధకః । అపస్మారశ్రాంతదేహేచ నాడీసమ్యఙ్నదృశ్యతే ॥అ॥ అప్పుడే స్నానము చేసినవారికిన్ని భుజించినవారికిని ఆకలిగొన్నవారికిని, మిక్కిలిదప్పిగొన్నవారికిని, యెండబడ్డవారికిని, మార్గమునడచినవారికిని, అలసినవారికిని, భూతపీడితులకును, భయము జెందినవారికిని, రోదనము చేసినవారికిని, స్త్రీసంగమము చేసినవారికిని, గంజాయిభక్షకులకును వాయునిరోధనము జేసి పవనాభ్యాసమును జేసినవారికిని, వెఱ్ఱివాండ్లకును, శుష్కశరీరులకును, కల్లుత్రాగినవారికిని, నాడి నిదానముగా తెగులదు.

## సన్నిపాతనాడీలక్షణము

౨౨. కాష్టభారస్యమధ్యేతు చుంచూగమనవద్భవేత్ । కుటిలం శిథిలం మందం సూక్ష్మంచ చపలంతథా । సన్నిపాతోద్భవంనాడీం విజానీయాద్భిషగ్వరైః ॥ అర్థము ॥ కట్టెలమోపునడుమను చుంచుపాకినట్లును, వంకరగను, శిథిలముగను, మెల్లగను, సూక్ష్మముగను చంచలముగను నడచును.

శ్రీనివాస ధన్వంతరీయములోని

# నాడీ పరిజ్ఞానము

## అష్టస్థానపరీక్షా ప్రకరణము

### స్పర్శ లక్షణము

౨౭. అథస్పర్శ మిమంవక్ష్యేక్వచిదుష్ణం ప్రభంజనః । అత్యుష్ణం పిత్తరోగస్తు అథవాత్యతి శీతలం । క్వచిత్శీతా శ్లేష్మరోగేద్వంద్వజశ్చైవ పృథక్పృథక్ ॥అ॥ తరువాత దేహస్పర్శలక్షణమును చెప్పుచున్నాము. వాతరోగికించుకంత యుష్ణముగను శ్లేష్మరోగికి ఒకప్పుడుష్ణముగను మరియొకప్పుడు చల్లగను, ద్వంద్వరోగికి మిశ్రమముగనుండును.

### స్వరూప లక్షణము

౨౮. తతః స్వరూపంద్రక్ష్యతాం శ్యామమూర్ధ్వప్రభంజనః। హారిద్రారక్తవర్ణాభాగాత్రంపైత్త్యం విజానయేత్॥ పాండురస్యచవర్ణాభాస్వరూపం కఫరోగిణాం । మిశ్రితంద్వంద్వరోగిస్తువివర్ణం సన్నిపాతకే ॥అ॥ పిమ్మట రోగియొక్క శరీరస్వరూపమును చూడవలెను. వాతరోగి శరీరకాంతి నల్లగనుండును. పసుపువర్ణముగగాని మెరుపువర్ణముగగాని యుండిన పైత్త్యరోగియనియు, తెల్లనివర్ణముగలిగియుండిన శ్లేష్మరోగియనియు, మిశ్రరూపముగనుండిన ద్వంద్వరోగియనియు గ్రహించవలెను. ఎర్రనిశరీరము నల్లగను, నల్లనిశరీర మెర్రగను నుండిన సన్నిపాతరోగమని గ్రహించవలెను.

### శబ్ద లక్షణము

౨౯. తతశ్శబ్ద గుణంవక్ష్యే సమశబ్ద స్సమీరణే । హర్షముఖణవాక్యైతే శ్లేష్మరోగిస్తు హీనతః । ద్వంద్వసంమిశ్రితం జ్ఞేయం

భిషక్ఛాస్త్రవిశారదైః ॥౨౦॥ అనుపిస్సాటి మాటలబట్టి లక్షణములను వివరించుచున్నాడు. వాతరోగి వడిగాను చెప్పినమాటలే మాటలా డును. పైత్యరోగి హాస్యముగుండినగను ఉద్రేకముగాను మాటలాడును. శ్లేష్మరోగి హీనస్వరముగ మాటలాడును. ద్వంద్వరోగి యొకపుడు వడిగాను, మరియొకపుడు హీనస్వరముగను, ఇంకొకపుడు సమముగను మాటలాడును.

## నేత్రపరీక్షా లక్షణము

౨౧. తతో నేత్రపరీక్షాం వక్ష్యే తేత్రస్యలక్షణాం । కించిత్ స్థూలం శ్యామవర్ణం తోయంస్రవతిమారుతైః । పీతంలోహితవర్ణంచ లోచనె పిత్తరోగతః । నేత్రములంక్వచిత్స్వాక్ష్వ పాండురం శ్లేష్మజంవరం । హారిద్రారక్తభానేత్రం అథవా సన్నిపాతకే ॥౨౧॥ ఈ శ్లోకముచే నేత్ర పరీక్షను చెప్పుచున్నాడు. నేత్రములు కొంచము లావుగా నుండియు, నల్లగానుండియు నీళ్ళుకారుచుండెనా వాతరోగమని గ్రహించేది. పచ్చగ యెఱ్ఱగను వుండెనా పయిత్యరోగమనియు, నేత్రములందు పుసులు నిండియుండి మిక్కిలి తెల్లగ నుండెనా శ్లేష్మరోగమనియు, పచ్చని కాంతి గలదిగాని యెఱ్ఱని కాంతి గలదిగాని యుండిన సన్నిపాతమ నియు నెఱుంగవలెను.

## పురీషలక్షణము

౨౨. పురీషలక్షణంవక్ష్యే వపమానంచబద్ధవిట్ । అథవాశ్యా మలం కృష్ణంతతః పైత్యస్తుపీడితః । రక్తవర్ణోథవా కేచిత్ మలంశ్వేతం కఫోద్భవం । ద్వంద్వజం మిశ్రితజ్ఞేయం వైద్యవిద్యావిశారదైః ॥౨౨॥ ఈ శ్లోకమున మలవర్ణ లక్షణమును చెప్పుచున్నాడు. వాతరోగికి మల బద్ధముగ నుండును. లేదా శ్యామలవర్ణముగ నుండును. అటుగాని యెడల కారునలుపుగ నయిన నుండును. పయిత్యరోగికి అంటెట పచ్చ

గనయినను ఒకానొక స్థలమున ఎఱుపువర్ణము గలదిగనయిన నుండును. శ్లేష్మరోగి మలము తెల్లగనుండును. ద్వంద్వరోగమునకు మిశ్రమవర్ణముగ నుండునని వైద్యశాస్త్రజ్ఞులు తెలిసికొనవలెను.

మూత్రపరీక్షాలక్షణము

౨౮. తతోమూత్రపరీక్షాంచ వక్ష్యతే శాస్త్రనిశ్చయం। వాయోశ్చశ్యామలంమూత్రంచ రక్తవర్ణంచ పయిత్యకే। శ్వేతవర్ణ కఫానాంచద్వంద్వజా మిశ్రితంభవేత్ ॥అ॥ శాస్త్రసమ్మతమయిన మూత్రపరీక్షను చెప్పుచున్నాఁడు. వాతరోగి మూత్రము నల్లగా నుండును. పయిత్యరోగి కెంపువర్ణము గలిగియుండును. శ్లేష్మరోగి మూత్రము తెల్లనైయుండును. ద్వంద్వరోగములకు మిశ్రమవర్ణములుగనుండును.

గ్రంథాంతరే

౨౯. తతోమూత్రపరీక్షాంచవక్ష్యతేశాస్త్రనిశ్చితా। వాయోశ్చ పాండురం మూత్రం రక్తవర్ణంచపయిత్యకే। అథవాపీతవర్ణంచ కామిలాయాం తథైవచ। శ్వేతవర్ణం కఫేచైవ ద్వంద్వజే మిశ్రితం భవేత్ ॥అ॥ వాతరోగి మూత్రము పాండురవర్ణముగను, పయిత్యరోగి కెంపుగను కామిలారోగికి పచ్చగను, శ్లేష్మరోగికి తెల్లగను నురుగుకట్టియును, ద్వంద్వరోగులకు మిశ్రమముగను వుండును.

౩౦. హితార్థంరోగిణాం మూత్రం తన్మాత్రంచ పరీక్షయేత్। నిశాయామంత్యయామేతు ఘటికానాం చతుష్టయె। శుద్ధకాంస్యనవే పాత్రెఽథవామృణ్మయేనవా ధృతమూత్రం దృష్ట్వా। ప్రయత్నేన మూత్రస్యార్థం ప్రదాపయేత్ ఆదిధారాం పరిత్యజ్యమధ్యధారాంపరిగ్రహేత్। అంత్యధారాచ నిస్సారా తతోదృష్ట్వాభిషగ్వరైః ॥అ॥ గ్రంథాంతరమున చెప్పబడిన మూత్రపరీక్షను చెప్పుచున్నాఁడు. రాత్రి అంత్యయామమున నాలుగు గడియలకు తెల్లవారు ననగా మూత్రము

ను క్రొత్తకంచుకంచములోగాని క్రొత్తమట్టిమూకుడులోగాని మొదటి ధారయు కడపటి ధారయు విడిచి మధ్యధారను పట్టించేది.

31. రక్తధార మహారోగీ పీతధారమహాజ్వరః । శ్వేతధార కఫోద్భంశ కృష్ణధార త్రిదోషజా । మూత్రం దృష్ట్వా పయత్నేవ అత ఊర్ధ్వం దాపయోత్ । తృణేనధార్యతె తైలం బిందుద్వయం వినిక్షిపేత్ ॥అ॥ మూత్రధార నెర్రగనుండెనా రోగము బలువైనదని విచారించేది. పచ్చగ పసుపునీళ్ళవలె నుండినను రోగము బలముగ నుండిన దనియే యెరుంగవలెను. ధార తెల్లగనుండెనా శ్లేష్మరోగమనియు నల్లగనుండెనా త్రిదోషజ మనియు నెరుంగవలెను. పిమ్మట మూత్రము నెండలో నుంచి యొక గడ్డిపోచతో రెండుబొట్లు మంచినూనె నామూత్రముపయిన విడిచేది.

## మూత్రపరీక్షలో మృత్యు అపమృత్యుజ్ఞానలక్షణము

32. బిడాలం మూషికం సర్పం వృశ్చికం కుక్కుటం శశం మర్కటాదిషుచిహ్నాని జ్వరేవమరణానిచ ॥అ॥ పిల్లివలెను, ఎలుకవలెను, పామువలెను, తేలువలెను, కోడివలెను కోడి మొదలగు జంతువులలో నట్టానిరూపముగ మారినను రోగికి మరణము గలుగు నని గ్రహించేది.

## శుభచిహ్నలక్షణములు

33. శంఖం చక్రం గదా పద్మం ఛత్రచామర మంకుశం। పీఠవీణా దర్పణంచ శోభనాని భవిష్యతి ॥అ॥ శంఖము, చక్రము, గద, పద్మము, వింజామరము, అంకుశము, పీఠము, వీణ, అద్దము మొదలగు వానిలో నట్టానిరూపముగ నయిన మూత్రముమీద వేయబడిన నూనెబొట్లు వ్యాపించెనా సాధ్యము సాధ్యమగు నని గ్రహించేది.

## ఆధునిక వైద్యశిఖామణులు చేయు మూత్రపరీక్షా విచారము

౩౮. రోగియొక్క మూత్ర ముదయకాలమున మొదటినారి స్వచ్ఛమైన తెల్లని గాజుసీసాలో పట్టించి యెండలోనుంచి చూచి మూత్రము పరిశుభ్రముగ వర్ణావికారము లేవియు లేకుండిన నిరోగమనియు ఎఱ్ఱగనుండి గాని పచ్చగనుండి గాని యందు మబ్బువలె గానవచ్చిన, పయిత్యరోగముచే శుక్రము పడుచున్నదనియు, మబ్బు లేకుండిన కేవల పయిత్యరోగమే యనియు నల్లగ గాని పాండురవర్ణముగ గాని యుండిన వాతరోగమనియు, అందును మబ్బువలె కళంకయుక్తముగ నుండిన వాతప్రకోపముగ నున్నదనియు, తెల్లగనుండిన శ్లేష్మరోగమనియు, కళంకయుక్తముగనుండిన దారుణమేహామువలన శుక్రనష్ట మగుచున్నదనియు గ్రహించి సమయానుకూలముగ చికిత్సలను చేయుదురు. శుక్లనష్టమె సర్వరోగములకును ముఖ్యకారణ మని చెప్పుదురు.

## జిహ్వాపరీక్షా లక్షణము

౩౯. జిహ్వాశీతాస్ఫోటఖరాన్వష్టం మారుతలక్షణం । శ్యామా శోణాభపిత్తే శ్వేతజిహ్వాద్రవా కఫే । సకంటకాచ శుష్కాచ సన్నిపాతస్య లక్షణం । మిశ్రవర్ణాభ వేజ్జిహ్వా ద్వంద్వజే పరికీర్తితా । ఏవం పరీక్ష్య వైద్యస్తు పశ్చాత్కుర్యాత్ చికిత్సకమ్ ॥అ॥ నాలుక పగిలి ముల్లుబారి పచ్చగానుండిన వాతరోగమనియు, ద్రవముగలిగి నల్లగ గాని ఎఱ్ఱగ గాని యుండిన పైత్యరోగమనియు, ద్రవముగలిగి తెల్లగా నుండిన శ్లేష్మరోగమనియు, ముల్లుబారి ద్రవము లేక నల్లగా నుండిన సన్నిపాత మనియు, మిశ్రవర్ణమైయుండిన ద్వంద్వరోగమనియు, తెలిసికొనవలెను. వైద్యులిట్లెనిమిది స్థానములను బాగుగ పరీక్షించి రోగమును నిర్ధారణచేసి చికిత్సలను చేయుట యుక్తము.

## క్షుధానాడీలక్షణము

౩౫. ప్రసన్నా తీవ్రతా నాడీ క్షుధాక్షుధా నాడీ ప్రవర్తతే ॥అ॥ తెప్పని తీవ్రగతిగల్గి మూడువ్రేళ్ళమీదను నడచునా ఆకలినంబంధమయిన నాడియని తెలియతగ్గది.

## అసాధ్యనాడీలక్షణము

౩౬. కుక్కుటేన జ్వరవేగేన మండూకం మోక్షకాలకే। హంసకే జ్వరమోక్షంతు సర్పవత్త్రిదోషకే। జలూకవత్స్యస్మరణం ఇతి నాడ్యస్య లక్షణం ॥అ॥ కోడినడకవలె నడచెనా శీఘ్రకాలమయిన రోగము కుదురుననియు, కప్పవలె నడచెనా నాలుగుపూటలు జ్వరము వచ్చుననియు, హంసవలె నడచెనా జ్వరము వదలెననియు, పామువలె నడచెనా త్రిదోషజమనియు, జలగవలె నడచిన మృత్యునాడి యనియు గ్రహించవలెను.

## గ్రంథాంతరనాడీవిశేషములు

### మరణకాలవాతాది నాడీలక్షణము

౩౭. వాతాధికో భవేదంతే। మధ్యే శ్లేష్మాధికో భవేత్। వాతాధికో భవేద్దాహే పంక్తిపిత్తాధికో భవేత్ ॥అ॥ మనుజులకు ప్రాణోత్క్రమణ కాలమున వాతనాడి స్వస్థానమును వదలి స్థానాంతరమున నిలచి అతిమాంద్యమును జెందును. కఫనాడి శ్లేష్మరోగాధిక్యమున స్వస్థానభూతమధ్యమాంగుళియందు అధికవేగము గలదిగ నుండును. వాతరోగాధిక్యకాలమున వాతనాడి స్వస్థానభూతమైన యనామిక యందు అనేకమాంద్యము గలదిగనుండును. పైత్యనాడి పైత్యరోగాతిశయకాలమున తన క్షేత్రమైన తర్జనియందు సహజవేగముకంటె రెండింత లధికవేగము గలిగియుండును.

మందగతి గలిగియుండగ అర్ధకమను సంజ్ఞగల పయిత్యనాడి జీవకమను సంజ్ఞగల కఫనాడిని తాకి వాతపిత్తశ్లేష్మనాడులకు వక్రగతి గలిగియుండిన పిత్తశ్లేష్మమనియు, అర్ధికసంజ్ఞగల పయిత్యనాడి వేగముగ నడచిన పిత్తశ్లేష్మజ్వరమనియు, మందగతిగలదిగ నుండిన అంతర్గత పిత్తశ్లేష్మజ్వరమనియు నెరుగదగును. ఈవిధమున వాతశ్లేష్మపిత్తనాడులు క్రమముగ మృతమనియు, అర్ధికమనియు, జీవకమనియు సంజ్ఞలు గలిగియుండును. మరియు నీమూడు నాడులలో వాతపయిత్యనాడులకు పార్శ్వచలనముగలిగియుండిన వ్యాధి యసాధ్యమనియు తెలిసికొనవలెను.

## పైత్యవాయు నాడీ లక్షణము

౪౩. బ్రహ్మనాడ్యాం హంసగతౌ విష్ణుకీర్వరకంస్పృశేత్ । త్రినాడ్యో వక్రగతయః పిత్తవాయోశ్చలక్షణం ॥ తా॥ కఫనాడికి మందగమనము గలిగి యుండగ విష్ణుసంజ్ఞగల పయిత్యనాడి రుద్రసంజ్ఞగల వాతనాడిని స్పృశించి కఫపిత్తవాతనాడులు మూడును వక్రగమనము గలిగియుండిన పయిత్యవాయువనియు, ఈపయిత్యనాడికి తీవ్రగతి గలిగియుండిన పిత్తవాయుజ్వరమనియు మందగమనము గలిగియుండిన అంతర్గతపయిత్య వాతజ్వరమనియు గ్రహించేది.

## శ్లేష్మపైత్యనాడీ లక్షణము

౪౪. తమోనాడ్యాం కూర్మగతౌ సాత్వికం రాజసః స్పృశేత్ । త్రినాడ్యో వక్రగతియః శ్లేష్మపిత్తస్యలక్షణం ॥ తా॥ తమస్స్వరూపమగు వాతనాడి మందగతి గలిగియుండగ రజోగుణస్వరూపమగు కఫనాడి శుద్ధసత్వ స్వరూపమగు విష్ణుసంజ్ఞగల పయిత్యనాడిని స్పృశించి మూడు నాడులకు వక్రగతి గలిగియుండిన పిత్తశ్లేష్మమని నెరుంగదగును. మరియు నీపయిత్యనాడి వేగముగనడచెనేని శ్లేష్మపిత్తజ్వరమనియు, ఇదియు

మందముగ నడచెనేని అంతర్గత శ్లేష్మపిత్తజ్వరమనియు నెఱుంగవలెను.

### కఫవాయు లక్షణము

౨౫. విష్ణునాడ్యాం మందగతావీశ్వరం బ్రహ్మకంస్పృశేత్ । త్రినాడ్యో వక్రగతయః శ్లేష్మవాయోశ్చ లక్షణమ్ ॥తా॥ పయిత్య నాడికి మందగతి గలిగియుండగ కఫనాడి వాతనాడిని స్పృశించి మూడు నాడులకు వక్రగమనము గలిగెనేని శ్లేష్మవాయు (కఫవాయు) వనియు ఈశ్లేష్మనాడి తీవ్రముగ నడచెనేని కఫవాయు జ్వరమనియు మందముగ నడచెనేని అంతర్గతకఫవాయుజ్వరమనియు.

### వాతశ్లేష్మనాడీలక్షణము

౨౬. అర్ధనాడ్యాం మందగతౌ మృతకోజీవకం స్పృశన్ । త్రినాడ్యోవక్రగతయో వాతశ్లేష్మస్యలక్షణం ॥తా॥ అర్ధకసంజ్ఞగల పిత్త నాడికి మందగతిగలిగియుండగ, మృతసంజ్ఞగల వాతనాడి జీవకమను శ్లేష్మనాడిని స్పృశించి మూడునాడులు వక్రముగ నడచెనేని వాతశ్లేష్మమనియు, ఈవాతనాడి శీఘ్రముగ నడచెనేని వాతశ్లేష్మజ్వరమనియు గ్రహించవలెను.

### వాతనాడీనిదానము

౨౭. బ్రహ్మవిష్ణోర్మందగత్యో రుద్రనాడీగతిస్స్ఫుటా । త్రినాడ్యోవక్రగతయో విజ్ఞేయం వాతనాడికం ॥తా॥ కఫపయిత్యనాడులు మందగమనము గలిగియుండగ వాతనాడి స్ఫుటగమనము గలిగియుండి మూడునాడులకు వక్రగమనము గలిగెనేని శుద్ధవాతనాడియని యెఱుంగవలయును. ఈవాతగతి తీవ్రముగనుండిన కేవల వాతజ్వరమనియు మందముగనుండిన అంతర్గత వాతజ్వరమనియు తెలియవలెను.

### కఫరోగనాడీ నిదానము

౨౮. రుద్రవిష్ణ్వో ర్మందగత్యోః బ్రహ్మనాడీగతిస్స్ఫుటా । త్రినాడ్యోవక్రగతయః విజ్ఞేయం శ్లేష్మలక్షణం ॥తా॥ వాతపిత్తనాడులు మంద

దము గ నడచుచుండగ కఫనాడి తీవ్రముగనడచి, మూడునాడులు వక్రముగ నడచుచుండిన శుద్ధశ్లేష్మమనియు ఈకఫనాడిగమనము తీవ్రముగ నుండిన శ్లేష్మజ్వరమనియు, మందముగ నడచిన అంతర్గత శ్లేష్మజ్వరమనియు నెరుంగవలెను.

## పైత్యనాడీ నిదానము

౨౯. బ్రహ్మరుద్రౌ మందగతౌ విష్ణునాడీ గతిస్ఫుటా । త్రినాడ్యోర్వక్రగతయః పిత్తనాడ్యస్తులక్షణమ్ ॥ తా॥ శ్లేష్మవాతనాడులు మందముగ నడచుచుండగ పయిత్యనాడీసంచారము తీవ్రమయ్యెనేనియు మూడునాడులు వక్రముగ నడచెనేనియు కేవలపయిత్యజ్వరమనియు, పైత్యనాడి శీఘ్రముగ నడచెనేని పిత్తజ్వరమనియు, మందముగ నడచెనేని యంతర్గత పయిత్యజ్వరమనియు తెలిసికొనవలెను.

## విషమసంకలితనాడీవిచారము

౩౦. త్రినాడ్యో మందగతయః త్రినాడీగతయస్సమాః । త్రినాడ్యో మందగతయః త్రినాడీగతియోజవాః ॥ తా॥ వాతశ్లేష్మపిత్తనాడులు మూడును మందగమనము గలవిగను క్షణాంతరమున సమగతిగలవిగను మరియొక క్షణమున మందగతి గలవిగను తదుత్తరక్షణమున వేగగతిగలవిగను లేక నీమూడునాడులు పయిన చెప్పబడిన వక్రగత్యాదుల నతిక్రమించి పూర్వక్షణమున వక్రగతి, సమగతి, మందగతి గలవిగను, ఉత్తరక్షణమందును తృతీయక్షణమందును వక్రగతి తీవ్రగతులు గలవిగను చతుర్థక్షణమున సమగతి మందగతి సమముగనుండెనేని విషమసంకలిత నాడియనియును విషమసంకలిత జ్వరమనియు కష్టసాధ్యమనియు తలంచవలెను.

## అథవాతాదినాడీషుద్వాత్రింశద్దోషనాడీనిదానము

౩౧. ముహుర్ల్లావుకగతః పిత్తో ముహుర్శ్చైకగతిస్తథా । ద్వాత్రింశద్దోషా స్సంప్రాప్తాముహుశ్చైకగతిశ్శివః ॥ తా॥ పిత్తనాడి మాటి

మాటికి తిత్తిరి గమనముగలదిగను, లేక పలుమారు కప్పయొక్క కంఠ నాడీ చలనముతో సమానమగుగతి గలదిగ నుండినను లేక వాతనాడి మాటిమాటికి చిలుకనడకకు సమమగుగతి గలిగియుండిన జిహ్వాదోషము మొదలగు ౩౨ దోషములునుసంప్రాప్తములగునని తెలిసికొనవలెను

## సూతికావాతనాడీనిదానము

౫౨. ముహుర్మందగతిర్బ్రహ్మన్ ముహుర్జవగతిః శివః । ముహుర్జవగతి ర్విష్ణుః సూతికారోగలక్షణమ్ ॥ తా॥ శ్లేష్మనాడి మాటిమాటికి మందగమనము గలదిగను వాతనాడి మాటిమాటికి శీఘ్రగతిగలదిగను అటులనే పిత్తనాడికికూడ జవగతిగలిగియుండిన సూతికావాతమని తెలియవలెను. ఈ సూతికావాతము పిత్తవాయువువలన జనించునని గూడ గ్రహించవలెను.

## బహిర్గుణములచే సూతికారోగనిదానము

౫౩. ఒడలునొప్పి, జ్వరము, వణుకు, దప్పి, శరీరమునబలుపు, వాపు, శూల, విరేచనములగుట యీమొదలగు గుణములు బాలింతకు గలిగియుండిన సూతికారోగమని తెలియవలెను. బాలింతయగు వడతిచేత నితరోపచారంబులు చేయించుటవలన గాని, క్లేశబహుళమువలనగాని దుష్టాన్నపానములవలనగాని, విషమాంశనము, అజీర్ణభోజనము శరీరము గట్టిపడి యెప్పటిస్థితికివచ్చి రజోగుణము తిరుగ కానరానిది. పురుషసంయోగము చేయుటవలనగాని కడుభయంకరమగు నీరోగము జనించును. మరియు నీసూతికారోగంబున వాతంబు ప్రకోపించి స్వస్థానమువలన విముచబడిన రక్తము సడ్డగించి బాలింతహృదయము మస్తకము, పొత్తికడుపు అనువానియందు శూలను గలిగించును. ఆశూల మక్కల్లక మను పేరంబరగు. మరియు జ్వరము, విరేచనములు, వాపు, శూల, కడుపుబ్బరము, అశక్తత కఫవాతరోగమువలన గలిగిన తంద్ర, అన్నద్వేషము, నోటినుండి నీరూరుట మొదలగు వికారములు గలిగి

యుండిన కఫవాతమువలన గలిగిన సూతికరోగమని తెలియదగినది. అందు మాంసము, బలము, అగ్నియు క్షీణించియుండిన రోగము కష్టసాధ్యము. ఇవన్నియు సూతికారోగోపద్రవములని గ్రహించేది. ఈ సూతికారోగము వెలుపలకు కాన్పించకుండినను ప్రసవించినపిమ్మట అనుమానములు గడచువరకు కొన్ని దేహతత్వములను సంవత్సరము వెళ్ళువరకును మఱికొన్ని తత్వములనున్ను ఆశ్రయించియుండును. ఈ రోగము గర్భవతియయినయువతికి ప్రసవకాలమునకు దగిన తొమ్మిదికాని పదియుగాని మాసములు పూర్తికాకుండగనే గర్భస్రావముగాని విచ్ఛిత్తుగాని సంభవించినను అట్టి పూబోడికిగూడ అంకురించియుండును. అట్టిసమయములలో గూడ తగిన చికిత్సలను జాగరూకతతో చేయవలెను. ఇంతియగాక స్త్రీలు, హంగు, వేపపువ్వు, మశూచి మొదలగు నష్టరోగములచే పీడింపబడి యారోగ్యస్నానమైన వెంటనే ఏకారణమున నయినను పురుషసంయోగము గలిగినపుడు గూడ సూతికారోగ మంకురించునని కొందరూహించుచున్నారు.

## అథ బాహ్యజ్వర అంతర్గత జ్వరఅస్థిగత జ్వరనాడీలక్షణము

౫౮. జవవక్రా త్రినాడస్య మందవక్రా త్రినాడికాః॥ ఏకశ్లేష్మావక్రగతిః జ్వరాంతర్గతిరస్థిగః॥ తా॥ వాతశ్లేష్మపిత్తనాడులు మూడును తీవ్రముగను వక్రముగను నడచెనేని బాహ్యజ్వరమనియు, ఈ మూడు నాడులును మందముగను వక్రముగను చలించెనేని అంతర్గతజ్వరమనియు, వాతపిత్తనాడులకు స్వాభావికగతిగలిగియుండగ శ్లేష్మనాడి యొకటిమాత్రము మందముగ నడచెనేని అస్తిగతజ్వరమనియు, అనగా వెన్నెముక నాశ్రయించియుండినదనియు, ఈఅస్తిగతజ్వరము అతిజాగరూకతతో చాలకాలము ఔషధసేవచేగాని విముక్తిగాదనియు నెరుంగవలెను, ఇది యసాధ్యమనియు కొందరు చెప్పుదురు. దీనికి శరీరములో తాపము, వెలుపల శీతము సర్వదా కుటిలజ్వరము, శరీరము కృశించి

తెల్లబారియుండుట మొదలగు గుణములు గలిగియుండును. ఈరోగమున శిరస్సు, నరములు, ఎముకలు, సంధులు (కీళ్ళు) పీసియుండు వేదనయు, కడుపుబ్బుటయు కూడ గలిగియుండును.

### మాంసగతజ్వరనాడీనిదానము

౧౧. దీపనంగాత్రపారుష్యం ఆధ్మానం శూలముల్బణం । జ్వరే మాంసగతే చైవభవంతీతి వినిశ్చయః ॥ తా॥ కడుపుబ్బోమంట, శరీరము బిరుసుగనుండుట, కడుపుబ్బుట, విశేషమయిన శూల, ఈగుణములు గలిగియుండిన మాంసగతజ్వరమని తెలియవలెను. ఇంతియెకాక అతి తీవ్రజ్వరము, దగ్గు, చెమట, దప్పి, ఒడలునొప్పి, తంద్ర, తాపము, శరీరము గగుర్పొడుచుట, మొదలగు లక్షణములుకూడ నీమాంసగతజ్వరమునకు గలిగియుండును.

### సన్నిపాత నాడీలక్షణము

౧౨. మందంమందం శిథిలశిథిలం వ్యాకులం వ్యాకులం వా । స్థిత్వాస్థిత్వాత్వరితగమనం పంచసూక్ష్మంగదానాం । ఏవంనాడీత్రివిధగతయో యస్యహస్తే పదేవా । దృశ్యన్తేZమీజగతి నభవేత్తస్య జీవాభిలాషః ॥ తా॥ వాతశ్లేష్మపిత్తనాడులగతులు మందమందముగను, వాయుసంచారములేని స్థలమునందుండు పాము కుబుసమువలె శిథిల శిథిలగమనముగలదిగను, వ్యాకులముగలదిగను, నిలచినిలచియు, ఎగిరెగిరియునడచును. తురగగతి చందంబున శీఘ్రగతిగలదిగనుండిన రోగముల స్థితిని సూక్ష్మముగ నెరుగదగును. ఈరీతిగ ఏపురుషునియొక్క గాని, స్త్రీయొక్క గాని హస్తపాదనాడులయందు గనుపడునో ఆ స్త్రీ పురుషులకు జీవితాశ లేదని యెరుంగవలెను.

### శుభనాడీ లక్షణము

౧౩. సువ్యక్తతా నిర్మలత్వం స్వస్థానస్థితిరేవచ । అచంచలమ మందత్వం సర్వేషాం శుభలక్షణమ్॥ తా॥ నాడులగతి స్ఫుటముగను

దోషరహితముగను స్థానాంతరము నొందకుండగను, చాంచల్యరహిత ముగను మాంద్యరహితముగను ఉండిన సర్వరోగంబులును సాధ్యము లుగా నెరుంగునది.

### రక్తగతజ్వర లక్షణము

౫౮. తీవ్రజ్వరోతిదాహశ్చ స్వేదాలస్య మతిభ్రమాః। అంగ వైకల్యమూర్ఛాచజ్వరేరక్తగతేస్మృతాః॥ తా॥ అతితీవ్రజ్వరము, అతి దాహము, చెమట, ఆలసట, మతిభ్రమ, ఒడలునొప్పి, మూర్ఛ, ఈలక్షణములుగలది రక్తగతజ్వరమని తెలిసికొనవలెను.

### మేదోగతజ్వర లక్షణము

౫౯. భృశంస్వేదస్తృషామూర్ఛాప్రలాపశ్ఛర్దిరేవచ। దౌర్గంధ్యారోచకౌ గ్లానిర్మేదస్థే చాసహిష్ణుతా॥ తా॥ మిక్కిలి చెమట, దప్పి, మూర్ఛ, వదరుట, కాంతి, దేహమందు దుర్వాసన, అరుచి, వేదనను సహించలేకపోవుట, మొదలగు వికారగుణములుండిన మేదోగతజ్వరమగును.

### చర్మగతజ్వర లక్షణము

౬౦. కొంచెము వాతము, జ్వరము, దాహము, నాడియందు మందగతి, తలనాదు మొదలగు గుణములుండును.

### అస్థిగతజ్వరలక్షణము

౬౧. అంతర్దాహం బహిశ్శీతం సతతం కుటిలజ్వరం। క్షయ పాండురదేహంచ జ్వరేహ్యస్థిగతేస్మృతం॥ తా॥ లోపలనుష్ణము, పైన శీతము, యెల్లప్పుడు కుటిలజ్వరము, క్షయదగ్గు, దేహముపాలిపోవుట మొదలగు గుణములుండును.

### మూర్ఛాజ్వర లక్షణము

౬౨. దారుణజ్వరములకు భీమమూర్ఛా జ్వరము గలుగును. జ్వరముండనపుడు శరీరమంతయు శీతముగనుండును. జ్వరము విడువగనే

మూర్ఛ తెలియును. ఇట్టి విషమము జ్వరముతో సమానమనియు మృత్యురూప జ్వరమనియు ఇట్టి గుణములు కాలాంతమునవరులకు గలుగుననియు గ్రహించవలెను,

సన్నిపాత జ్వరలక్షణము

౬౩. కంఠమందును, నుదుటను, హృదయమందును, చెమటపుట్టుట, తంద్ర, మతిభ్రమ, శరీరమున దాహము, కండ్లుమండుట, కన్నులెఱ్ఱగనుండుట, వచ్చునగుట, మూర్ఛయందు భ్రాంతి, ప్రలాపము, హృదయశూల, గుంభవము, వెక్కిళ్ళు, శ్వాస, సంతోషము మొదలగు గుణములు సన్నిపాతజ్వరితుల కగపడును.

సన్నిపాత వివరణము

౬౪. సంధికసన్ని, అంతకసన్ని, హృద్దాహకసన్ని, చిత్తవిభ్రమసన్ని, శీతాంగసన్ని, తాంద్రికసన్ని, కంఠకుబ్జసన్ని, కర్ణికసన్ని, భగ్ననేత్రసన్ని, రక్తష్ఠీవసన్ని, ప్రలాపసన్ని, జిహ్వాగసన్ని, అభిన్యాససన్ని యని పదమూడు విధములు.—

సాధ్యాసాధ్య సన్నిపాత వివరణము

౬౫. ఇందు సంధిక, తాంద్రిక, ప్రలాప, చిత్తవిభ్రమ, జిహ్వక, కర్ణికమను నీ యారుసన్నిపాతములును సాధ్యములు. హృద్దాహక, అంతక, భగ్ననేత్ర, కంఠకుబ్జ, రక్తష్ఠీవ, శీతగాత్ర, అభిన్యాసములను నీయేడును అసాధ్యములు.

సంధికాల ప్రమాణ వివరణము

౬౬. సంధికసన్ని కాలున్నొకదినము--అంతకమునకు దినములు పది-హృద్దాహసన్నికిరువది నాళులు-విభ్రమసన్ని కిరువదియు నొకటి-శీతాంగసంధి కొకపక్షము--తాంద్రికమున కిరువదియు నయిదు లేక ఆరునొకటి--కంఠకుబ్జమునకు పదియుమూడు దినములు--కర్ణికకు మూ

దుమానములు--భగ్నస్త్రసంధికి దినము లెనిమిది రక్తోష్ఠమునకుపదియు-ప్రలాపమునకు పదియునాల్గు-జిహ్వాకమునకు పదియునారునాళ్ళు-అభిన్యాసనన్నికి-పదియునై దుదినములు కాలప్రమాణముగ నెఱుంగుము.

## సంధిదశావస్థా నిర్ణయము

౬౭. యీరోగమంకురించినపుడు ప్రథమమున వెఱ్ఱిపట్టినవానివలె నుండును. బ్రతుకనినయుధైర్యపడును, కల్లలాడును. ఊర్ధ్వశ్వాసముకలుగును. ఊర్ధ్వదృష్టి గలుగును. కాలుచేతులు కదలకుండును. అంగదాహము, రక్తస్పర్శము అధిక చెమట కలుగుట మరణము మొదలగు నీపదియవస్థలును యొకదానివెంబడి యొకటి క్రమముగ గలుగును.

## సన్నిపాత గుణ వివరము

౧. సంధికసన్నికి దేహ మెప్పటివలెనుండును. శూలపుట్టును. ఒడలువాచును. నొచ్చును. దగ్గును అధికతాపము గలుగును.

౨. అంతకసన్నికి-దాహము బుద్ధిచలనము తాపము తలవణుకు అధికప్రసంగము వాంతి యెక్కిళ్ళు జ్వరము మొదలగు గుణములుండును.

3. హృద్దాహసన్నికి అధికముగ మాటలాడుట, తాపము,బుద్ధిచలనము, కంఠమునసొప్పి, ఇటునటు దొర్లుట, ఒడలునొప్పి, పెదవులెండుట, దగ్గు, మందముగనుండుట, శరీరకంపము కంఠముసను సుదుటను చెమటబుట్టుట మొదలగు లక్షణములుండును.

౪. చిత్తవిభ్రమసన్నికి ఒడలంతయు నొచ్చుట, వాతపైత్యములు ప్రకోపించుట, ఉలికిపడుట, వెఱ్ఱిచూపు, కనుబొమలు ముడిబడుట, పాడుట, ఆడుట, అధికప్రసంగముచేయుట. మొదలగు గుణములుండును.

౫. శీతాంగసన్నికి ఒడలు మిగుల చల్లగనుండుట, దగ్గు, ఉబ్బ
సము, మెక్కిళ్ళు, కీళ్ళనొప్పులు, వాంతి, తాపము మూర్ఛ,
విరేచనములగుట, శరీరము వణకుట మొదలగు లక్షణము లుండును.

౬. తాంద్రికసన్నికి యోగియాగి తరుచుమాటలాడుట, నిద్రిం
చుట, అధిక తాపము, విరేచనములగుట, ఉబ్బసము, ఒడలుదురద,
కన్నులు పెద్దవిగ జేసిచూచుట, కన్నుల నీరుగార్చుట, తీవ్రజ్వరమును
గలిగియుండును.

౭. కంఠకుబ్జమునకు అతిదాహము, తలవిసురు, మెడ కుదియ
బడుట, అధికముగ మాటలాడుట, తాపము, మూర్ఛ, శరీరము నొ
ప్పుట, దగ్గు, వాంతి, యెక్కిళ్ళు, శ్లేష్మము తెగిపడుట, తలనొప్పియు
గలుగును. ఇది యసాధ్యము.

౮. కర్ణికసన్నికి అధిక ప్రలాపము, నాలుకపగులుట, యెక్కి
ళ్ళు, దగ్గు, వణకు, చెవికొనలువాచుట, తాపమును గలిగిన కర్ణిక
యని తెలియవలెను.

౯. భగ్ననేత్రసన్నికి కన్నులెర్రనై పగిలినట్లుండుట, నీరుకారు
ట, చూపులేకుండుట, అధిక ప్రసంగము, అదరిపడుట, వణకుటయు
గలిగిన యసాధ్యము.

౧౦. రక్తోష్టమునకు నాలుకయు పెదవులును పగిలి నెత్తురు
కారుట, దగ్గుట, వణకుట, శరీరమంతయు వణకుట, నాలుక నల్లనయి
ముండ్లుగ్రుచ్చుకొనునట్లుండుటయును గలిగిన యసాధ్యము.

౧౧. ప్రలాపసన్నికి దగ్గుట, అధికముగ తరుచుమాటలాడుట,
అతితాపము, వాతశ్లేష్మములు ప్రకోపించుట, ఎక్కిళ్ళు, తాపజ్వర
మును గలిగిన సాధ్యము.

౧౨. జిహ్వాగనన్నికి ఊర్ధ్వశ్వాసము, తాపము, దగ్గు, నాలుక ద్రవము లేక మండ్లవలె నల్లనై యుంటుట, మాటలుడుగుట, చెముడు, జడత్వమును గలిగియుండును. సాధ్యము.

౧౩. అభిన్యాసనన్నికి వాతపిత్తశ్లేష్మము లేకమై యుండుట, ముఖము నునుపుబారి యుండుట, అధికనిద్ర గలుగుట, ఒడలునొచ్చుట, తాపము గలుగుట, బలహీనత, దాహము, చెమటయూరుట మొదలగు గుణములుండిన యసాధ్యము.

సంధిప్రకరణము ముగిసినది.

—:0:—

మజ్జాగతజ్వరలక్షణము

౧౮. హిక్కా-శ్వాసో భ్రమ శాసోగాత్రాశా మపిపీడనం। జ్వరేమజ్జాగతే న్యూణాం ప్రాణానామవరోధనమ్.

తా॥ ఎక్కిళ్లు, శ్వాస, భ్రమ, దగ్గు, అవయవములు నొప్పెత్తుట, ప్రాణవాయువు నడ్డగించుట, ఇట్టి గుణములు గలది మజ్జాగతజ్వరమని యెరుంగునది.

శుక్లగతజ్వరలక్షణము

౧౯. బహునిద్ర ప్రలాపశ్చ సంజ్ఞానాశశ్చజాయతే। శుక్లప్రాప్తేజ్వరేసోయం అసాధ్యః పరికీర్తితః। ఏతాని విపరీతాని లక్షణానిచయన్యపై। సంస్యస్యాసాకష్టసాధ్యస్యా ద్విజ్ఞేయశ్చభిషగ్వరైః

తా॥ విశేషనిద్ర, వదరుట, తెలివిలేకపోవుట, మొదలగు లక్షణములుగలిగియుండిన శుక్లగతజ్వరమనియు అసాధ్యమనియు పైలక్షణములు స్వల్పముగ గలిగియుండిన కష్టసాధ్యమనియు గ్రహించవలెను.

క్రిమివాయుజ్వరలక్షణము

౨౦. ఈరోగికి సర్వాంగములందును వాతమువ్యాపించి నాడిని

కానరానీక అత్తిగంభీరముగ 3—4—5—6 గాని దినములు తెలివి లేకనే యుండును. ఈరోగము నతి జాగరూకత గలిగి విసుగుజెందక పలుమారు దీర్ఘకాలము నాడిని నిదానముగ చూచుచుండిన గాని దొరుకదు కావున వైద్యులు దయాశీలురై రోగులను పరీక్షించుచుండవలెను. ఇట్టిరోగమునకు మిగుల వేడిచేయు సింహాప్రతీపాలనము మొదలగు గరళసమ్మేళనము గల యౌషధములను క్రిమినాశనమునకు తగినట్టియు విరేచనసాధనములగు నట్టియు యనుపానములతోనిచ్చిన విరేచనమూలమున క్రిములు పడిపోవును. ఈరోగమునందు విరేచనములు వమనములు మొదలగు దుర్గుణములు గలిగియుండిన యసాధ్యముగాన నీరోగమును జాగరూకతతో గనిపెట్టుట యుక్తము.

విషమజ్వరలక్షణము

२०. క్షణేశీతం క్షణేహ్యుష్ణం క్షణేజ్వరసముత్కటః। క్వచిన్నిద్రా దివాస్వాపో ద్వితీయో హ్యాహ్నికః క్వచిత్। జ్వరశ్చాతుర్థికో వాపి విషమజ్వరలక్షణమ్,

తా॥ ఒక నిముసమున శీతము మరియొకనిముసమున నుష్ణము ఇంకొక నిముసమున విశేషజ్వరము ఒకప్పుడు నిద్ర పగలునిద్ర జ్వరము రెండుదినముల కొకసారి గాని నాలుగుదినముల కొకసారి గాని వచ్చుట మొదలగు లక్షణములుగలది విషమజ్వరమని యెరుంగవలెను.

మూర్ఛాజ్వరలక్షణము

(మతాంతరము)

२१. జ్వరాణాం దారుణానాంచ భీష్మో మూర్ఛాజ్వరోభవేత్। ప్రవర్తతే యదాశీతం తదాతంద్రాజ్వరోగతః। యదాజ్వరవిముక్తశ్చ తదాముక్త్వావిమూర్ఛనాత్ దోషజ్వరసమం విద్యాత్ తజ్జ్వరం మృత్యురూపకం। జ్వరేష్వాహ్య సాధ్యశ్చ కాలాంతే జాయతేత్రశరీరిణామ్

తా॥ మూర్ఛాజ్వరము, భయంకరజ్వరములలో నతిభయంకర మైనది. యెప్పుడు శీతముగలుగునో అప్పుడు చంద్రగలుగును. అప్పు డు జ్వరము హెచ్చును. యెప్పుడు జ్వరము విడుచునో అప్పుడే మూ ర్ఛనాడ విడిచిపోవును. గాన నీజ్వరము దోషజ్వరమనియు జ్వరములలో మృత్యురూపమనియును ప్రాణాంతకాలమున పనిలేదనని యును గ్రహించవలెను.

### శీతజ్వరలక్షణము

౨౩. శీతంకంపో భ్రమోల్లాపః రోమహర్ష విజృంభణమ్ శిరఃకట్యాస్యపార్శ్వేషు పిండికోద్వేషసంక్లమః । నేత్రత్వఙ్నఖహారిద్రం తృష్ణాతిక్తాస్యతాతథా । తుష్ణాగాసోపపన్నశ్చ లింగం శీతజ్వరస్యతే॥

తా॥ శీతము, వణుకు, అతిభ్రమ, గురక్ఖలు. ఆవలించుట, శిరస్సు, నడుము, తొడలు, ప్రక్కలు, ఇవి పలియగొట్టినట్లుండుట, ప్రేలాపుట, శ్రమ, కన్నులు, శరీరము, గోళ్ళు ఇవి పచ్చగనుండుట దప్పి, నోరుచేదుగనుండుట, పొడదగ్గు, గలిగియుండుట ఈలక్షణము లుండిన శీతజ్వరమని చెప్పుదురు.

### దోషహేతుకజ్వరలక్షణము

౨౪. శరీరం శీతలంయస్య దాహాతాపాకరంయది । స్వరస్తు దుర్బలః పిత్తప్రకోపో జాయతేజ్వరే । జ్ఞానాజ్ఞాన క్రియాజస్య దోష హేతుక ఉచ్యతే.

తా॥ ఒడలు చల్లగనుండుట, దాహము, తాపము, హీనస్వర ము పిత్తప్రకోపము ఈలక్షణములు గల జ్వరము తెలిసియు తెలియ కయు చేసిన దోషమువలన పుట్టినదని తెలియువలెను.

### స్త్రీసంగమదోషజ్వరలక్షణము

౨౫. జ్వరప్రకోపకాలమువందు స్త్రీసంగమమువలన శరీరము నొచ్చుట, వణుకు, రొమ్ములోపుండుట, కల్లలాడుట, తాపము,

భ్రమ, కాలుచేతులు చల్లనై యుండుట, నాడియందుదోషము మొద లగు గుణము లుండును.

## ఆమజ్వర లక్షణము

౭౩. లాలాప్రసేకో హృల్లాన స్తంభ స్స్యాద్గురురోచకం । తంద్రాలశ్చ వికారాశ్చ వైరస్యం గురుగాత్రతా । క్షుతంచ బహుమూత్రంచ స్తబ్ధ శ్చాబలవాన్నరః। ఆమజ్వరస్యరూపాణి నదద్యాత్తత్ర భేషజమ్॥

తా॥ చొంగకారుట, శరీరము నిగనిగలాడుట, స్థంభించియుండుట, అరుచి, అలసట, వాలుమూలిక, వికారము, విరసత్వము, శరీరము బరువెక్కుట, తుమ్ములు, బహుమూత్రము, జడత్వము, అతిబలము ఇట్టిగుణములు గలిగియుండిన ఆమజ్వరముగలిగినదని తెలిసికొనవలెను. ఈజ్వరమునకు మందు లియ్యగూడదు.

## మతాంతరము

ఆమజ్వరలక్షణమునకు మతాంతరము తంద్ర, ఆలస్యము, అన్నము జీర్ణముకాకుండుట, నోరు విరసముగనుండుట. అంగములు బరువుగనుండుట, ఆకలి లేకుండుట, పలుమారు మూత్రము వెడలుట, అంగములు స్థంభించియుండుట, అధికజ్వరము యీలక్షణములు గలిగియుండిన అపక్వజ్వరమని యెరుంగునది. దీనికి మందౌషధమీయజనదు. ఔషధమిచ్చిన అధికజ్వరమువచ్చును. మఱియు శోధనీయౌషధములనుగాని శమనీయౌషధములనుగాని ప్రయోగించిన విషమజ్వరముగలుగును. దీనికి పరిమాణము ౩, ౫, ౭, ౧౧ దినములు. ఇట్టి జ్వరమునకు లంఘనమే పరమౌషధము.

## ఔషధజ్వర లక్షణము

౭౪. ఓషధీ గంధజే మూర్ఛా శిరోరుగ్వమథుః క్షుమః॥

తా॥ మూర్ఛితోన్మాద వాంతి తుమ్ములను కలిగిన ఓషధుల వాసనవలన కలిగినదని గ్రహించేది.

విషసంబంధమువలనగలిగిన జ్వర లక్షణము

౭౮. ముఖము నల్లగనుండుట, దాహము, అతిసారము, అన్నముం దిష్టములేకుంట, దప్పి, మూర్ఛతో నొప్పిగలుగుట మొదలగు గుణములు గలిగియుండును.

కోపాదాగతజ్వర లక్షణము

౭౯. శరీరము వణకుట, భయపడుట, శోకించుట, కేకలు వేయుట, త్రుళ్ళిపడుట యీగుణములు గలిగియుండును.

కామోద్రేకాదాగతజ్వర లక్షణములు

౮౦. మతిచంచలించుట, తంద్ర, ఆలస్యము, భోజనమునం దిచ్ఛలేకుండుట, హృదయమువేదన, ఒడలుచిక్కియుండుట, మనోవ్యాధి యీగుణములుండును.

ప్రయోగజ్వర లక్షణము

౮౧. మోహము, మూర్ఛ, అతిదాహము, శరీరమున బొబ్బలులేచుట, త్రుళ్ళిపడుట, పలవరించుట మొదలగు గుణములు గలిగియుండును.

జ్వరితులకు దోషించుట

౮౨. జ్వరపీడితుడు స్త్రీసంగమము చేయుట, దూరము నడచుట. శీతలోపచారముల నొందుట, విశేషముగ దాహమునుత్రాగుట, పులుసు, కారము, ఉప్పు, వగరు, చేదు పసరుకూరలు మొదలగువాని యమితభక్షణము, కల్లుత్రాగుట, మొదలగు వానివలన దోషములు గలుగును. సందర్భమును గ్రహించి వైద్యులు చికిత్సలను జేయవలెను. ఇంతియుగాక జ్వరితులు చందనమలదికొనుట, వెన్నెలలో సంచరించుట, పండుకొనుట, తాంబూలచర్వణము, రక్తవస్త్రములు

తా॥ మూర్ఛతికోన్మధ వాంతి తుమ్ములను గలిగిన ఓషధుల వాసనవలన గలిగినదని గ్రహించేది.

విష సంబంధమువలనగలిగిన జ్వర లక్షణము

౭౮. ముఖము నల్లగనుండుట, దాహము, అతిసారము, అన్నము దిష్టము లేకుంట, దప్పి, మూర్ఛతో నెప్పిగలుగుట మొదలగు గుణములు గలిగియుండును.

కోపాదాగతజ్వర లక్షణము

౭౯. శరీరము వణకుట, భయపడుట, శోకించుట, కేకలు వేయుట, త్రుళ్ళిపడుట యీగుణములు గలిగియుండును.

కామాద్రేకాదాగతజ్వర లక్షణములు

౮౦. మతిచంచలించుట, తంద్ర, ఆలస్యము, భోజనముసం డిచ్ఛ లేకుండుట, హృదయమువేదన, ఒడలుచిక్కియుండుట, మనోవ్యాధి యీగుణములుండును.

ప్రయోగజ్వర లక్షణము

౮౧. మోహము, మూర్ఛ, అతిదాహము, శరీరమున బొబ్బలులేచుట, త్రుళ్ళిపడుట, పలవరించుట మొదలగు గుణములు గలిగియుండును.

జ్వరితులకు దోషించుట

౮౨. జ్వరపీడితుండు స్త్రీసంగమము చేయుట, దూరముసడచుట. శీతలోపచారముల నొందుట, విశేషముగ దాహమును త్రాగుట, పులుసు, కారము, ఉప్పు, వగరు, చేదు పనరుకూరలు మొదలగువాని యమితభక్షణము, కల్లుత్రాగుట, మొదలగు వానివలన దోషములు గలుగును. సందర్భమును గ్రహించి వైద్యులు చికిత్సలను జేయవలెను. ఇంతియుగాక జ్వరితులు చందనమలదికొనుట, వెన్నెలలో సంచరించుట, పండుకొనుట, తాంబూలచర్వణము, రక్తవస్త్రములు

నడకవలన శ్రమపడినవారు, అలసినవారు, కృశించినవారు, నేత్ర రోగులు, క్షయరోగులు, గ్రహణిపీడితులును లంఘనము లుండరాదు.

## జిహ్వాకుగల్గిన రక్తాది వర్ణదోష నిర్ణయము

౭౭. కొన్ని దోషములవలన నాలుక యెఱ్ఱగానుండుట, ముల్లు శాఖలనుండుట, తడిగానుండుట, జ్వరమువచ్చుట, దాహము, శరీర మందు తాపము, మొదలగు గుణములుండిన రక్తజిహ్వాకదోషమనియు (2) నాలుక కృష్ణవర్ణముగను, పిడుకవలె ముల్లుబారినట్లుగను, శరీరము తాపముగను, నరపుమాటలును, ఉబ్బసము, చెమట, దాహము, నవ ఇవి గలిగియుండిన కృష్ణజిహ్వాకదోషమనియు (3) నాలుక తెల్లనై యుండుట, గొంతు పగిలియుండుట, శరీరమందు నొప్పి గలిగి యుండుట, మఱపు, అతిసారము, వమనమువచ్చినట్లుండుట, మతి భ్రమ, పలుమారు మూర్ఛనొందుట, మొదలగు గుణములుండిన శ్వేతజిహ్వాకదోషమనియు వైద్యులెఱింగి జిహ్వాగ్లేషిన లెపనక్రమముగ చికిత్సను జేయవలెను.

## ఏకాహికద్వ్యాహికాది జ్వర లక్షణములు

౭౮. శరీరధారులకు తాము పూర్వజన్మమున చేసిన మహా పాపముకు ప్రతిఫలముగ నీజన్మమున నానాకాలములయందు ఏకాహికద్వ్యాహిక, త్ర్యాహిక, చాతుర్థిక, పంచాహ్నిక, సప్తాహిక, నవాహ్నిక, త్రయోదశాహ్నిక, పక్షాన్తిక, మాసాంతిక, వర్షాంతికజ్వరములు ప్రాప్తించుచుండును. అందేకాహ్నిక జ్వరమునకు దప్పి, దాహము, ఒంటినొప్పి, విశేషముగ దుర్భాషలాడుట, ఓకిరింత, వమనము, ఎక్కిళ్ళు, శ్వాస, తలయు గన్నులును తిరుగుట, బల హీనత, శరీరదాహము, రాత్రులందు ప్రొద్దుపోయినకాలమందిని అన్యత

మగు జ్వరము మొదలగు గుణములు గలిగియుండును. యీరోగిని రెండుదినములు లంఘనములు చేయించి పిమ్మట జోగినీరసము, రసానందభైరవము, వైష్ణవీరసము, నీలకంఠరసము మొదలగు నౌషధములను అనుపానయుక్తముగ నీయవలెను అనుపానవివరము:—లవంగములు, మోడి, లవంగపత్రి, మొదలగువాని చూర్ణముతో పైఔషధములలో దేనినైనచేర్చి అల్లపురసముతో గాని మిరియాలరసముతో గాని ఇచ్చిన ఏకాహ్నికజ్వరము విడుచును.

## ద్వ్యాహ్నికజ్వరలక్షణములు

౮౯. ద్వ్యాహ్నికజ్వరమునకు రెండు రాత్రులతిక్రమించి భయంకరమగు జ్వరము, మిగులశీతము, మోహము, దాహము, శిరోభారము, దప్పి, విశేషమయిన చెమట, వాంతి, ఓకిరింత, హిక్క, గన్నులు తిరుగుట, నొప్పి, అరిచేతులు అరికాళ్ళు వీటియందు తాపము, నిద్రరాకుండుట, బలహీనత, నురుగుతో నుమియుట, కాలుచేతులు చల్లనైయుండుట మొదలగు గుణములు గలిగియుండును. దీనికి జోగినీరసమును అనుపానయుక్తముగ నిచ్చిన నివర్తియగును.

## త్ర్యాహ్నికజ్వరలక్షణము

౯౦. త్ర్యాహ్నికజ్వరము మూడురాత్రులు గడచిన పిమ్మట దారుణమగు శీతజ్వరము, రోదనము, వణుకు, తాపము, మోహము, శ్రమ, బలహీనత, శరీరావయవములు శుష్కించుట, కన్నులం దెల్లపుడు నీరుకారుచుండుట, అరుచి, అగ్నిమాంద్యము, అన్నికీళ్ళయందును జడత్వము, అజీర్ణము, ఆహారవిహారాదులయం దయిష్టము, విష్టంభము, శ్వాస, కఫము మిక్కిలి చిక్కియుండుట మొదలగు గుణములచే నొప్పియుండును. ఈత్ర్యాహ్నికజ్వరమునకుముఖ్యకారణము విప్రద్రవ్యాపహారరూపమగు మహాపాతకము. జ్వరారంభమునం దొకదినము ప్రకో

పించుటయె గాక బహుకాలము పీడించును. దీనికి నీలకంఠరసము గంధర్వరసము, మహాజోగిసిరసము తేనెతో చేర్చి యనుపానయుక్తముగ నిచ్చిన నివారణమగును. ఆదియందుగాని రోగనివారణానంతరమున గాని యథాశక్తిని అధమపక్షము 100 మంది బ్రాహ్మణులకు సంతర్పణము చేయవలెను.

## చాతుర్థికజ్వరలక్షణము

౫౧. చాతుర్థికజ్వరమనగా నాలుగహోరాత్రము లతిక్రమించి జ్వరమువచ్చుట, అంగశైథిల్యము, విశేషమగుచలి, తాపము, మూర్ఛ, ఇంద్రియములందధికశోష, ఒడలు చిక్కియుండుట, కపాలమునపోటు, ఓకిరింత, హిధ్మ, నాలుకెగురు, అరికాళ్ళు అరిచేతులు చల్లగనుండుట, అరోచకము, అగ్నిమాంద్యము, అన్నద్వేషము, అజీర్ణము, శ్వాస, కఫము, తలదిరుగుట మొదలగు గుణములు గలిగియుండును. దీనికి నీలకంఠరసము గాని, వైష్ణవీరసమును గాని, జోగిసీసరసమును గాని లవంగచూర్ణములో శర్కరను చేర్చి తేనె యనుపానముతో నిచ్చిన నివర్తించును.

## పంచాహ్నికజ్వరలక్షణము

౫౨. పంచాహ్నికజ్వరమనగా ఐదహోరాత్రము లతిక్రమించి మిక్కిలి చలితో గూడిన జ్వరము, మూర్ఛ, శ్రమ, శరీరము కృశించుట, కఫము, తాపము, నిద్రలేకపోవుట, శీతలము, కంపవాతము, తలకన్నులువీనియందు వేదన, అంతర్దాహము, కడుపుబ్బరము, తలదిరుగుట, అజీర్ణము, అగ్నిమాంద్యము, అన్నద్వేషము, శోష, శూల, అతిసారాదిగుణములు గలిగియుండును. ఈరోగులకు సన్నిపాతభైరవిగాని, నీలకంఠరసమునుగాని, లక్ష్మీనారాయణలేహ్యమునుగాని యొక మండలము లేక, రెండుమాసములు సేవించిన నివారణమగును.

## నవాహ్నికజ్వరలక్షణము

౯౩. నవాహ్నికజ్వరమునకు తొమ్మిది అహోరాత్రములు అతిక్రమించి విడువక నతిశీతలముతో గూడిన జ్వరము, దప్పి, శిరోవేదనము, కఫము, శ్వాస, తాపము, అన్నద్వేషము, అగ్నిమాంద్యము, తలదిరుగుట, కరపాదములు చల్లనై యుండుట మొదలగు భయంకరములయిన సన్నిపాతగుణములు గలిగియుండును. దీనికి గరుడధ్వజరసమునుగాని, వీరవిక్రమరసమునుగాని యనుపానయుక్తముగ నిచ్చిన మండలముదినములకు కుదురును.

## త్రయోదశాహ్నికజ్వరలక్షణము

౯౪. త్రయోదశాహ్నికజ్వరమునకు పదమూడుదినము లతిక్రమించి తాపము, చలితోగూడిన జ్వరము, భ్రమ, మఱపు, మనోనైకల్యము, కీళ్ళయందు జడత్వము, నేత్రములు తిరుగుట, నిస్సత్తువ, కాంతిహీనత, పాండువు మొదలగు సంధిగుణములు గలిగియుండును. దీనికి నీలకంఠరసము, సన్నిపాతము, గరుడధ్వజరసము, రసానందభైరవులలో దేనినయినను అనుపానయుక్తముగ నిచ్చిన నిరువదొకదినమునకు నివారణమగును.

## పక్షాంతజ్వరలక్షణము

౯౫. పక్షాంతజ్వరమునకు ౧౫ దివసములు గడచినపిమ్మట జ్వరము, శీతము, తాపము, మోహము, తలనొప్పి, అగ్నిమాంద్యము మలబద్ధము, అజీర్ణము, అన్నమందరుచి, కామిల, పాండువు, వాపు, శరీరము శుష్కించియుండుట, నిస్సత్తువ, కాంతిహీనత, సర్వాంగములయందును పచ్చనివర్ణము, గోళ్ళు కన్నులు గూడ పచ్చగానుండుట, మొదలగు గుణములు గలిగియుండును. ఈరోగమున నీలకంఠరసమును గాని వంటబాలసూర్యోదయమును గాని యనుపానయుక్తముగ తేనెతో రెండువేళల నాలుగుమాసములు సేవించిన నివారణమగును

## మాసాంతజ్వరలక్షణము

౯౬. మాసాంతజ్వరమునకు ముప్పదిదినములు గడచినతరువాత జ్వరము, చలి, తాపము, సంతాపము, మూర్ఛ, తలనొప్పి, తలస్రేలిబడుట, శ్వాస, కఫము, నిస్సత్తువ, అజీర్ణము, అరుచి, మలబద్ధము, అన్నద్వేషము, తలతిరుగుట, కన్నులు, చెవులు, వీనియందు శూల, పీనస నేత్రములనుండి నీరుకారి పుసికట్టుట, మొదలగు గుణములుండును దీనికి జోగినీరసము, పంచామృతరసాయనము, నీలకంఠరసము, అనుపానయుక్తముగ నాలుగుమాసములు సేవించిన నివారణమగును.

## సంవత్సరాంతికజ్వరలక్షణము

౯౭. వర్షాంతికజ్వరమున లోకరీత్యాది గడచినపిమ్మట చలిజ్వరము, తాపము, తలనొప్పి, చెవులు, ముక్కు, కపాలము వీనియందు పోటు, శరీరము శుష్కించుట, బలహీనత, కీళ్ళయందు వాపు, శూల, అగ్నిమాంద్యము, అజీర్ణము, అన్నద్వేషము, అరుచి, కన్నులయందు నీరుకారుట, సప్తధాతువులు శోషించియుండుట, హిధ్మ, శోష, శ్రమ, నాలుక, నోరు వీనియందు చేదుగనుండుట మొదలగు గుణములు గలిగియుండును. ఈజ్వరమునకు మహారాజ మృగాంకరసమును గాని, నీలకంఠరసమును గాని, జోగినీరసమును గాని అయిదు మాసములు రెండువేళల అనుపానయుక్తముగ సేవించిన నివారణమగును.

## గ్రంథాంతరే అష్టధాతుస్థాన నిర్ణయమ్

౯౮. ఆయుర్వేదమందు సంగ్రహముగ చెప్పఁబడిన యష్టధాతుస్థానము పరీక్షావిధమును చెప్పఁబోవుచున్నాను. హస్తములు రెంటియందుండు నాడులు పాదములు రెంటియొక్క పైభాగమునందు నాడులు కంఠమున కిరుప్రక్కలనుండు నాడులు ముక్కున కిరుప్రక్కల

సంధుస్థానములను ఈచెప్పబడిన తావులందు నాడు లెనిమిదివిధంబులు గనుండును. అని మునులు చెప్పియున్నారు.

### ప్రకారాంతరం

౯౯. రెండుచేతుల మణికట్టులందును, రెండుపాదముల మీాది భాగములందును, గళమున కిరుప్రక్కలను, దవుడయందును, నాసిక కిరుదెసలందును, నాభియందును గూడ పరిశోధింపవచ్చుననియు ఇన్నింటిలో ప్రధానము చేతిమణికట్టునం దనియు కొందర భిప్రాయపడు చున్నారు.

### నాడీస్థాననిర్ణయము

౧౦౦. పాదగతనాడులు చీలమండలకు క్రిందుగ మూడంగుళముల పరిమితిస్థానమునను, హస్తగతనాడులు చేతిమణికట్టుకు క్రిందుగ మూడంగుళముల ప్రదేశమునను, నాసామూలమునం దాశ్రయించి యుండు నాడులు ఏకాంగుళపరిమిత స్థానమందును, కంఠమూలమున నుండు నాడులు రెండంగుళముల నిడుపుగల స్థానమునందును ఇరుప్రక్కల నుండును గాన నిట్టి నాడీస్థానముల నెరుంగవలెను. ఈయెనిమిది తావులందును ప్రాణవాయువు ఆశ్రయించి యుండుననియు నెరుంగునది.

### నాడీగమన విధములు

౧౦౧. నాడి రొమ్మును విశాలముగను, సూక్ష్మముగను, నరములను విడివిడిగను, సూక్ష్మముగను జేయును. హృదయమునకు నాడి నడచుచుండును గాన దేహమందలి రోగమును హృదయమునకు నడిచే నాడివలన తెలిసికొనవచ్చును.

### నాడిని పరీక్షించు విధము

౧౦౨. చేతి బొటనవ్రేలుకు ప్రక్కగా ఎగుగెత్తునాడిని మణికట్టు ఒక అంగుళముక్రిందుగ వైద్యుడు తన మూడు పెద్దవ్రేళ్ళచే నడి

మీదను వదలించియు నలుమారు మూడుమారలు పరీక్షింప నాడీగమనమును తెలిసికొనవచ్చును. పురుషులకు కుడిపార్శ్వములందును కుడిచేతియందును స్త్రీలకు యెడమచేతియందును, ఎడమపార్శ్వమందును పరీక్షించవలెను. రెండుచేతులందును పార్శ్వములందును పరీక్షించుట యుక్తాభిప్రాయము.

## నాడీనిదానము

౧౦౩. వైద్యుడు రోగియొక్క కుడిచేతి యంగుష్ఠమూలమును తన కుడిచేతి పెద్దవ్రేళ్ళు మూటితో నిదానముగ చూడవలెను. తాను నాడిని నిదానించుటకు పూర్వము రోగియొక్క హస్తమును మోచేతి వరకు చక్కగ పిసికి వ్రేళ్లను మెటికెలు విరచి సాగదీసి చాపించి హస్తముయొక్క అంగుష్ఠమూలమునందలి మధ్యభాగమును తనదక్షిణాంగుళిత్రయముచే సదా వాతగతిని పరీక్షించవలెను. అట్లు చేయుటవలన అంగుళిమూలపట్లు వదలి నాడి నిదానమునకు చక్కగ పట్టుపడును.

## వైద్యునికి పథ్యకర్తవ్యము

౧౦౪. నేర్పరియగు వైద్యుడు నాడిని పరీక్షించునప్పుడు స్వస్థచిత్తుడై, తన యాత్మను, మనస్సును, శాంతిపరచుకొని రోగియొక్క దక్షిణహస్తమును తన మూడువ్రేళ్ళచే పట్టి నిదానించి గుణదోషములను తెలిసికొనవలెను.

## మతాంతరము

౧౦౫. వైద్యుడు ప్రాతఃకాలమున స్నానసంధ్యావందనాది కృత్యములు నెరవేర్చికొని, పరిశుద్ధుడై, సుఖాసీనుడగు రోగికడ కేగి తానును సుఖముగ కూర్చుండి రోగమును నిదానించవలెను. రోగియొక్క నాడిని వైద్యుడు నిదానించి చూచి తన హస్తమును కడుగుకొనినయెడల ఆరోగియొక్క వ్యాధులు నశించును.

## నాడీపరీక్షాకాలము

౧౦౬. వైద్యుడుదయకాలమునను, సాయంకాలమునను, రోగి యొక్క చాచబడిన హస్తమందలి మణికట్టునకు వెనుకట్టునందు నాడిని పరీక్షించవలెను.

## స్త్రీపురుష నాడీలక్షణం

౧౦౭. పురుషులకు నాభికూర్మ మధోముఖముగను, స్త్రీల కూర్మ మూర్ధ్వముఖముగను ఉండుటచే స్త్రీపురుషులకు నాడులు వ్యత్యాసముగానుండును. గాన స్త్రీల కెడమహస్తమందును, పురుషులకు కుడిహస్తమందును పరీక్షించవలెను. (శ్లో॥ నారీణాం వామభాగేతుపురుషస్యతుదక్షిణే శోధయేత్) (ప॥ ౨॥ (హ్రి)యఃస్ఫూర్తాభవతి వామకరే వధూనాంపుంసాంచ దక్షిణకరే) (ప॥ ౨॥ (వామభాగేస్త్రీయాయత్నాజ్యానాడీపుంసస్యతుదక్షిణే) ఇత్యాదివచనానుసారముగ స్త్రీల కెడమచేతియందును, పురుషులకు కుడిచేతియందును నాడిని పరీక్షించవలెను. నాడీపరీక్షాజ్ఞానము కేవలము గ్రంథములను చదువుటవలనమాత్రము సాధింపబడనేరదు. రత్నపరీక్షాదులకువలెనే అభ్యాసమువలనను, శాస్త్రసాంప్రదాయ స్వానుభవములవలనను, పెద్దల సాంగత్యమువలనను మాత్ర మలవడును. వృద్ధవైద్యము, బాలజ్యోతిషము ననులోకోక్తి కిదియే కారణము. అనగా చాలాకాలము వైద్యశాస్త్రమును చదివియు, వానిసారమును పెద్దల సాంగత్యమువలన వినియు, గ్రహించియు, అనేకములగు రోగములను నిదానించియు, చికిత్సలను చేసియు, చేయుచుండగ చూచియు నిదానజ్ఞులై యుందురు గాన వృద్ధవైద్యమే శ్రేష్ఠతమమని వాడుదురు.

## గ్రంథాంతరస్త్రీనాడీలక్షణం

౧౦౮. స్త్రీలకు వాతనాడి సర్పమువలెను, పిత్తనాడి కప్పవలె

ను, శ్లేష్మనాడి హెంచవలెను నడుచును. కాన వైద్యులు స్త్రీలయొక్క ఎడమహస్తమునందును, ఎడమపాదమందును, శాస్త్రసాంప్రదాయ స్వానుభవములవలన రోగమును నాడీమూలమున నిదానించవలెను ఇంతియగాక రోగియొక్క నాడిని పలుమారు పట్టి విడుచుచు బుద్ధిచే బాగుగ యూహానుసార్లు పరీక్షించి రోగమును తెలిసికొనవలెను.

### గ్రంథాంతరం

౧౦౯. రోగియొక్క నాడిని వైద్యుడు తన మూడువ్రేళ్ళచే స్పృశించి వాతము, కఫము, పైత్యము వీనియొక్క గమనములను వరుసగ మందమధ్యమ తీక్ష్ణములుగ నెరుంగవలెను. వాతకఫపైత్యములే త్రిదోషములు. వీటిని సూక్ష్మబుద్ధిచే వైద్యు డూహించవలెను.

### సిద్ధాంతకృతవాతశ్లేష్మపైత్యనాడీస్థాననిర్ణయం

౧౧౦. ఈ "వాతపైత్యకఫములను" ప్రయోగమును బట్టియు మరికొన్ని యసంగత వచనములను బట్టియు కొందరువైద్యులు నాడీనిదానమందు అనామిక (పవిత్రపువ్రేలు) యందనగా నిదానించు వైద్యుని మొదటివ్రేలి క్రిందనుండు నాడి వాతమనియు, మధ్యవ్రేలి క్రిందనుండునది పైత్యమనియు, కడవ్రేలు (తర్జని) క్రిందనుండునది శ్లేష్మమనియు భ్రమపడుచున్నారు. అట్లుగాదు. "వాతపిత్తద్వయోర్మధ్యే నాడీకఫగతిస్తథా" అను వచనానుసారముగ రెండువైపుల నుండు వాతపయిత్యనాడులకు మధ్యనుండునదియె కఫనాడి యని తెలిసికొనవలెను.

### పాదగతనాడీలక్షణం

౧౧౧. ఆయువు, శరీరలఘుత్వము, శరీరస్వస్థత, జ్వరవిమోచనము, వీటి నెరుంగుటకై పాదమునందుండు నాడిని పరీక్షించవలెను.

హ స్తగతనాడీలక్షణం

౧౧౨. ఏరోగియొక్క నాడి హస్తమందుగాని, కంఠమందుగాని తీవ్యగ్యవప్రమాణమైనను స్వస్థానమును వదలెనేని వాడు దేహమును విడుచునని గ్రహించవలెను.

హస్తగతనాడియందే గుణములను నిదానించవలెను

౧౧౩. అజీర్ణము, ఆకలి, ఆమదోషము, అనుజ్వరము వచ్చుట, దుష్టవాతము, పయిత్యము, శ్లేష్మము మొదలగువానిని హస్తనాడియందె చూచి తెలిసికొనవలెను.

పురుషులకు నాడినడచు విధము

౧౧౪. గ్రంథాంతరే॥ వాతనాడి నెమలి, హంస, కోడి వీనివలె నడచును. పిత్తనాడి తాబేటివలెను, జలగవలెను నడచును. శ్లేష్మనాడి పామువలెను, కప్పవలెను నడుచును.

కంఠనాడీపరీక్ష

౧౧౫. ఆగంతుకజ్వరము, దప్పి, ఆయాసము, మైథునము, అలిక, భయము, శోకము, కోపము అనునివి కంఠనాడిని పరీక్షించుటవలననే నెఱుంగవలెను.

నాసానాడిపరీక్ష

౧౧౬. నాసికయందుండు నాడివలన మరణము, జీవితము, కామము, నేత్రరోగములు, శ్రవణరోగము, తలనొప్పి, ముఖరోగములు, నాసానాడీనిదానమున నెఱుంగవలెను.

నాభిగతి నాడీపరీక్ష

౧౧౭. నాభి కిరుప్రక్కలనుండు నాడివలన గర్భమందలి వాతపిత్తశ్లేష్మదోషములను గ్రహించవలెను.

దవుడలయందుండు నాడీపరీక్ష

౧౧౮. దవుడలందుండు నాడీనిదానమువలన కంఠము, శిరము కిరుపార్శ్వములు, కర్ణములు మొదలగు వానియందుండు వాతశ్లేష్మపైత్యదోషముల నెఱుంగవచ్చును.

## త్రికాలగతనాడీ సంచారక్రమము

౧౧౯. ఉదయకాలమున నాలుగుఘడియలవరకు పైత్యయుక్తముగను, పిమ్మట మధ్యాహ్నమువరకు శ్లేష్మయుక్తముగను, సాయంకాలమున వాతయుక్తముగను, అపరాహ్నమున వాతయుక్తముగను, అర్ధరాత్రమున మరల పిత్తయుక్తముగను నడచుచుండును.

## మతాంతరము

౧౨౦. అర్ధరాత్రియందునడచు పైత్యనాడి యుదయకాల మతిక్రమించి నాల్గుగడియలవరకు కూడ పైత్యయుక్తముగ నడచుచుండును. ఇంతియకాక శీతకాలము, వర్షాకాలము, ఉష్ణకాలమునను మూడుకాలములందును దేశతత్వము ననుసరించి నాడులు భేదముగ నడచుచుండును గాన వైద్యులు మెలకువతో మూడుకాలములందున నాడిని పరీక్షించి, రోగమును నిదానించి తగిన చికిత్సలను చేయుచుండవలెను.

## నాడుల నామభేదములు వాని లక్షణములు

౧౨౧. స్నాయువు, వసా, హింస్రా, ధమనీ, ధామనీ, ధరా, తంతుకీ, జీవితజ్ఞా సిరాయనినాడులుతొమ్మిదివిధములుగనుండును. మనుజుల మణికట్టునకు వెనుక మూడంగుళముల ప్రదేశమున జీవసాక్షియని చెప్పబడు ధమని యను నాడి యుండును. దాని సంచారముచే శరీరము నందుగల సుఖదుఃఖములను నాడీపరిజ్ఞానులు తెలిసికొందురు.

## వాతాదినాడీగమన క్రమము

౧౨౨. వాతరోగమున నాడి వక్రముగను, కఫరోగమున స్థిరముగను, పైత్యరోగమున చంచలముగను నడచును. మరియు వాతపిత్తరోగమున పామువలెను, శ్లేష్మవాతమున రాజహంసవలెను, శ్లేష్మపిత్తరోగమున మండూకమువలెను విషమజ్వరంబున తునుకలుగను,

సాత్మ్యముగను సన్నిపాతంబున సద్భృశ్యమై పలువిధములుగను చలించు చుండును.

## గ్రంథాంతరము

౧౨౩. పిత్తశ్లేష్మనాడులు స్వతంత్రరాహిత్యంబులుగ నుండుటచే వాతనాడియొక్కగతి ననుసరించియే పిత్తశ్లేష్మనాడులకు గమనము గలిగియుండును. గావ వక్రముగ వచుచు జలగచందమున నాడులకు అగ్రమునందుండెడి వాతనాడి చలించెనేని పిత్తశ్లేష్మములు గూడ చలించును.

## ఆరోగ్యనాడీలక్షణము

౧౨౪. నాడి హంసయొక్కయు, యేనుగయొక్కయు నడక గలిగి ముఖము ప్రసన్నముగ నుండిన అట్టిరోగికి ఆరోగ్యము కలుగును. నిరోగియొక్కనాడి భూతల యనంబడును. అది సర్పమువలె స్థిరముగను బలముగను నడచును.

## వాతనాడీలక్షణము

౧౨౫. వాతరోగమునందు సర్పము, జలగ గమనముల బోలి నడచును.

## పిత్తనాడీలక్షణము

౧౨౬. పిత్తరోగమునందు కాకి, లావుకము, కప్ప వీనిగతివలె నాడి నడచుచుండును.

## కఫరోగ నాడీలక్షణము

౧౨౭. శ్లేష్మరోగమున రాజహంస, నెమలి, పావురము, గువ్వ, కోడి వీని గమనముల బోలియుండును.

## సన్నిపాత నాడీలక్షణము

౧౨౮. వృక్షములను తొలచునట్టిపిట్ట (లకుముకి, లేక కంసాలి పిట్ట) వృక్షమును వేగముగా నిలచినిలచి పొట్లుకొట్టునో అటేవిధమున

నిలచినిలచి మూడు వ్రేళ్ళక్రింద నడచుచు స్ఫుటముగనుండునది పాతనాడి యని యెఱుంగునది.

## గ్రంథాంతరము

౧౨౯. త్రిదోషములచేఁ బడు నాడి లావుకపిట్ట, తిత్తిరిపక్షి, మీనీవల్లంకిపిట్ట వీటివలె నడచుటయే గాక యొకసమయమున మందముగను, మరియొకసమయమున శీఘ్రముగను నడచిన సన్నిపాత మని యెఱుంగునది.

## అసాధ్యనాడీలక్షణము

౧౩౦. నాడి మందముగను, మిక్కిలి శిథిలముగను, అతి చపలముగను నిలచినిలచియు, దృశ్యాదృశ్యముగను నుండిన సన్నిపాతమనియు, అసాధ్యమనియు, గ్రహించేది.

## గ్రంథాంతరము

౧౩౧. నాడియొకవేగముగ నెగయుచున్న, మిగుల స్థిరంబుగను, మాంససంచారిగను సూక్ష్మముగను, అతి వంకరగను నడచెనేని యసాధ్యము.

## మతాంతరము

౧౩౨. ఏరోగియొక్క నాడియొక్కగతి స్థిరముగను ముప్పది త్రుటికలు (చిటికెలు) కాలము నడచిన ఆరోగి జీవించును. లేక నాడి నిలచినిలచి అదేరీతిగ నడచిన నట్టిరోగి చచ్చును.

## గ్రంథాంతరే

౧౩౩. సేజనుని కత్యుష్ణంబుగనుండు కాలంబున అతి శీతంబుగను అతిశీతంబుగనుండు కాలంబున నతి తాపంబుగను, నానావిధగతులు గలదిగ నాడి చలించెనేని యారోగి మరణము నొందును.

## మతాంతరే

౧౩౪. యేరోగియొక్క నాడి మందగతిని పొంది నడచుచు,

మధ్యమాంగుళియందు వాతశ్లేష్మములయొక్క గతులను పొంది మాటి మాటికి అనేకవిధములుగ చక్రముమీద కూర్చున్న యా పిత్తనాడిగూడా తన్నుస్వస్థానమును విడచి, యంతలోనె భయమునొంది రోగికప్పుడు సూక్ష్మత్వమునొందిన యట్టిరోగి బ్రతుకడని కొందరు మునులు వచించిరి.

గ్రంథాంతరే

౧౩౫. శ్లో॥ త్రిదోషెస్పందతే నాడీమృత్యుకాలే చనిశ్చలా।
జ్ఞేయాసర్వవికారేషు వైద్యైః కుశలకర్మభిః॥

తా॥ త్రిదోషనాడి సదా చంచలించుచు మృత్యుకాల మాసన్నమైన సమయమున నిశ్చలంబుగ నుండును. ఇట్టిభేదములను సన్నిపాతంబుల నెఱుంగవలయును. ఇట్టిరోగి మృత్యువునొందబడును.

గ్రంథాంతరే

౧౩౬. నాడి యొకప్పుడు మిక్కిలి వణకుచుండు, మఱియొకప్పుడు కొద్దిగా కదలుచుండు, అంతలో కనుబడకపోవుచుండు, మరల కానబడుచుండినయెడల వైద్యుఁడట్టిరోగ మసాధ్యమని యెంచి దూరముగ పోవలెను.

మతాంతరే

౧౩౭. యేరోగియొక్క నాడి యతి సూక్ష్మముగను అతి వేగముగను శీతలముగను నడచిన అట్టిరోగి యాయువు క్షీణమయిన దని తెలియవలెను.

గ్రంథాంతరే

౧౩౮. విద్యుద్రోగిణోనాడీ దృశ్యతే నచదృశ్యతే। అకాల విద్యుత్పాతేనవగచ్ఛేద్యమసాధనం.

తా॥ యేరోగియొక్క నాడి మెఱుపువలె కనబడి కనుబడక యుండినను ఆకాలమందలి మెరుపువలె నుండునో అట్టిరోగి యమని సదనమున కేగును.

మతాంతరే

౧౩౯. తిర్యగ్గ సప్తాచ యా నాడీ సర్పగా వేగవత్తరా । కఫపూరితకంఠస్య జీవితం తస్య దుర్లభం॥

తా॥ యేరోగియొక్క నాడి వెచ్చనయి వంకరగా నడచుచు సర్పగతి గలిగి మిక్కిలి వేగముగ నడచుచు కంఠమునందు కఫము పూరించియుండునో ఆరోగి యమమందిరము జేరును.

గ్రంథాంతరే

౧౪౦. దృశ్యతే చంచలా నాడీ కరే హీనా పృశ్యతే । ముఖం వికాసితం యస్యతం దూరం పరివర్జయేత్॥ తా॥ యేరోగియొక్క నాడి పాదమునందు గానవచ్చుచు హస్తమునందు గానరాక ముఖము వికాసముగనుండునో ఆరోగి యమపురంబున కేగునని తెలిసికొని వయిద్యుడు వానిని విడువవలెను.

మతాంతరే

౧౪౧. వాతపిత్తకఫస్యాపి త్రయోయస్యాం సమాశ్రితాః। కృచ్ఛ్రసాధ్యామసాధ్యం వా ప్రాహుర్వైద్యవిశారదాః॥ తా॥ యేరోగియొక్క నాడిని వాతపిత్తకఫములు ఆశ్రయించియుండునో ఆరోగియొక్క రోగ మసాధ్యమనియు కష్టసాధ్యమనియు వయిద్యవేత్తలు చెప్పిరి.

మాసాంతమృత్యు నాడీలక్షణము

౧౪౨. భూలతా భుజగాకారా నాడీదేహస్యసంక్రమాత్। విశీర్ణక్షీణతాం యాతిమాసాంతే మరణం ధ్రువం.

తా॥ నాడి సర్పాకారముగ దేహమంతయు వ్యాపించి సిథిలముగను జీర్ణముగను యుండిన అట్టివాడు మాసాంతమున మృత్యువదగును.

అర్థమాసమృత్యునాడీలక్షణము

౧౪౩. దేహశైత్యం ముఖశ్వాసో నాడీ తీవ్రవాహినీ। మాసార్థం జీవితంతస్య నాడీవిజ్ఞానభాషితం॥

తా॥ యే రోగియొక్క దేహమందు శైత్యమును ముఖమునందు విశేషమగు శ్వాసయును గలిగి నాడి మిగుల తీవ్రముగను దాహాయుక్తముగను నడచునో ఆరోగి యొక్క పక్షము జీవించునని నాడీపరిజ్ఞానులయిన మునులు వచించిరి.

సప్తదినమృత్యునాడీలక్షణము

౧౮౮. ముఖనాడీవహేత్తీ[illegible] శీతలావహేత్ । ఆయాతిపిచ్ఛిం స్వేదస్నప్తరాత్రం నజీవతి॥

తా॥ వాతనాడి మిక్కిలి తీవ్రముగలిగియుండినను ఒళ్ళువు శీతలముగ నుండినను శరీరముబంకగా చెమటబుట్టినను అట్టిరోగి ఏడు దినములలో మృతిపొందును.

గ్రంథాంతర

౧౮౯. క్షణాద్గచ్ఛతివేగేన శాంతితాం లభతేక్షణాత్ । నస్థానాన్మరణంతస్యయద్యంగే శోభవర్జితః॥

తా॥ యేనరుని నాడి స్వస్థానమును వదలి క్షణకాలము తీక్షణముగను క్షణకాలము శాంతముగను నడచుచు శరీరము శోభవర్జితమ్ముగ నుండినను అట్టిమనుజు డేడు దినములకు మృతిబొందును.

పంచదిన మృత్యునాడీలక్షణము

౧౯౦. పాదాంగుళిగతా నాడీమందమందాయ దాభవేత్ । పంచభిర్దివసైస్తస్య మృత్యుర్భవతి నాన్యథా॥

తా॥ ఎవనిపాదాంగుష్ఠమును జెందునాడి మందమందముగ నడచునో అట్టిమనుజు డైదుదినములలో మృత్యువును బొందును.

చతుర్థ దివసమృత్యునాడీలక్షణము

౧౯౧. పాదాంగుళిగతా నాడీకోష్ణా వేగవతీభవేత్ । చతుర్భిర్దివసైస్తస్య మృత్యురేవన సంశయః॥

తా॥ ఎవనియొక్క నాడి పాదాంగుళిగతంబై కించిదుష్ణముతో గూడి యతి త్వరితముగ నడచుచుండునో అట్టివాడు నాల్గవదినమున యముని కతిథియగును.

మతాంతరే

౧౪౮. నిర్శిష్యదక్షిణే పాదేనాడీమేకాం విశేషతః। ముఖనాడీ రవహేన్నిత్యాంతదాది నచతుష్టయం॥

తా॥ ఎవనికి కుడిపాదమున నొకనాడి యతితీవ్రముగ నడచుచుండుటయేగాక ముఖంబునగూడ నొకనాడి నడచుచుండెనేని యట్టి మనుజుడు నాలవదినమున గతాసుడగును.

త్రిరాత్రమృత్యు నాడీలక్షణము

౧౪౯. ముఖేనాడీయదానాస్థి మధ్యేశైత్యం బహిఃక్లమః। యదామందావహేన్నాడీ త్రిరాత్రం నైవజీవతి॥

తా॥ వాతనాడికదలక లోపల చల్లగనుండి పయిననాడి మందమందముగనడచిన అట్టిరోగి మూడురాత్రులలో ప్రాణములనువిడుచును.

గ్రంథాంతరే

౧౫౦. హిమవద్విషదానాడీజ్వరదాహేనతాపినాం। త్రిదోషస్పర్శనం భజతాం తదామృత్యుర్దినత్రయాత్॥

తా॥ ఎవనికి మిక్కిలి క్షారముగు జ్వరము గలిగి యుండినపుడు నాడి మంచువలె శీతలంబుగ నుండుటయేగాక త్రిదోషస్పర్శనంబంధము గలిగియుండెనేని యట్టినరుడు మూడుదినములలోమరణము నొందును.

మతాంతరే

౧౫౧. పాదాంగుళగతా నాడీచంచలా యదిగచ్ఛతి। త్రిభిశ్చదివసైస్తస్యమృత్యురేవన సంశయః॥

తా॥ ఎవనికి పాదాంగుళ్యగతంబగు నాడి మిగుల చంచలగతిని నడచుచుండునో అట్టిజనుడు మూడుదినములలో జమునిపీటికరుగును.

## దివసద్వయమృత్యునాడీలక్షణము

౧౨. శీఘ్రానాడీమలోపేతా శీతలా వాథదృశ్యతే । ద్వితీయే దివసే మృత్యుర్నాడీ విజ్ఞానభాషితమ్॥

తా॥ ఏరోగియొక్క నాడి మలోపేతముగను శీఘ్రగతిగలదిగను, శీతలముగను గనుపడునో ఆరోగి రెండవదినమున వైవస్వతాంతిపురమున జేరును.

గ్రంథాంతరే

౧౩. స్థిరానాడీభవేద్యస్య విద్యుద్ద్యుతిరివేక్షతే । దినైకం జీవితం తస్యద్వితీయే మృత్యురేవచ॥

తా॥ ఎవనినాడి చాలాకాలము స్థిరముగనుండి, మెఱుపువలె తళుక్కున కనుపడి కనుబడక యుండునో అట్టిమనుజు డొకదినము మాత్రము జీవించి మరుచటిదినమున కాలుని సదనమున జేరును.

మరియొకరి మతము

౧౪. శీఘ్రానాడీ మలోపేతా మధ్యాహ్నేగ్ని సమోజ్వరః॥ దినమేకం జీవితం తస్యద్వితీయేహ్ని మ్రియేత సః॥

తా॥ ఏరోగియొక్క త్రిదోషనాడి మలయుక్తమై త్వరితగతిగ నడచుచు మధ్యాహ్నకాలమున నగ్నితుల్యమగు జ్వరమువచ్చునో అట్టి రోగి మరుదినమున మరణమునొందును.

గ్రంథాంతరే

౧౫. స్థిత్వానాడీ ముఖేయస్య విద్యుజ్జ్యోతిరివేక్షతే । దినైకం జీవితంతస్య ద్వితీయే మరణంధ్రువం॥

తా॥ ఎవనియొక్కనాడి ముఖమున నిలచినిలచి పరపబుతువందు మెఱుపుమెఱయు తెఱంగున సతిత్వరితగతి గలిగియుండునో అట్టి వాడొక దినము మాత్రము జీవించి మరుదినమున దండధరుని కతిథి యగును.

ద్వాదశయామమృత్యునాడీలక్షణం

౧౫౬. గతింభ్రమరక స్యేవాంశచ్ఛేదకదినైవతు । స్థానంపైవ స్పందతేనిత్యం పునర్గచ్ఛతిచాంగుళౌ । మధ్యేద్వాదశయామానాం మృత్యురేవనసంశయః॥

తా॥ ఏదేహధారియొక్క నాడి తుమ్మెదవలె ఝుంఝుమ్మని బరుగిడుచును భుజములందును అంగుళములందు చలింపకుండునో అట్టి వాడు పదియురెండు యామములలో (దివసార్ధము = ౩౬ గంటలు) కాలునివీటి కరుగును.

దినాంతమృత్యునాడీలక్షణం

౧౫౭. మరణోడమరుగాకారా భవేదేక దినేనచ॥

తా॥ దినాంతమునందు మృతిగలుగువానికి నాడి డమరుకము వలెనుండును.

షష్టయామమృత్యునాడీలక్షణం

౧౫౮. మధ్యేరేఖాసమానాడీ యదితిష్ఠతినిశ్చలా । షడ్భిస్తు ప్రహరైస్తస్య మృత్యుర్జ్ఞేయోవిచక్షణైః॥

తా॥ ఏనరునియొక్క యంగుష్ఠమూలమున నుండు నాడులన్నియు మధ్యమాంగుళియందు రేఖాసమంబుగ నుండుటయెగాక నిశ్చలంబుగనుండునో అట్టినరుడు ఆరుయామము (18 గంటలు) లలో ప్రాణములు విడుచును.

యామార్ధమృత్యునాడీలక్షణం

౧౫౯, ద్వ్యంగుళాబాహ్యతో నాడీ మధ్యేరేఖాంబహిర్వ్యథా। సార్ధప్రహరకాన్మృత్యుర్జాయతే నాత్రసంశయః॥

తా॥ ఏదేహియొక్క నాడి తర్జని మధ్యమాంగుళముల విడచి యనామికయందు మాత్రము చలించుచు దానికి క్రింద రేఖాకారంబుగ స్పృశించుచుండెనేని అట్టిరోగి ఒకటిన్నర యామము 4½ గంటలలో మృతినొందును.

అర్ధయామమాత్రమృత్యునాడీలక్షణం

౧౬౦. చలాచలితవేగాచ నాసికాధారసంయుతా । శీతలాదృశ్యతే యాచ యామమధ్యేచ మృత్యుదా॥

తా॥ ఏరోగియొక్క నాడి ముక్కురంధ్రములయొక్క శ్వాసోచ్ఛ్వాసముల యాధారముతో గూడినదై వణుకుచును చంచలముగను శీతలముగను యుండెనేని అట్టిరోగి అర్ధయామములో మృతిబొందును.

గ్రంథాంతర

౧౬౧. అంగుష్ఠమూలతో బాహ్యేత్ర్యంగులే యదినాడికా। ప్రహరార్ధాద్బహిర్మృత్యుం జానీయాచ్చవిచక్షణః॥

తా॥ ఎవనియంగుష్టమూలమందలి నాడులతావును వదలి మూడంగుళములకు క్రిందుగా మధ్యయామికలయందు నడుచుచుండునో అట్టివారు అర్ధయామమునకు యమాంతికము జెందుదురు.

భూతజ్వరనాడీలక్షణం

౧౬౨. తదాభూతాభిషంగేవాత్రిదోష వదుపస్థితా। వసుంగా వహతే నాడీతథాన చక్రసంగతా॥

తా॥ భూతాభిషంగముగలవాని నాడి త్రిదోషయుతనాడివలె వాతపిత్తశ్లేష్మంబులు సంకలితమై సమానాకారంబుగ నడచుచుండును.

రోగరహితాపమృత్యునాడీలక్షణం

౧౬౩. అపమృత్యుర్నరోగాచ్చ నాడీతత్సన్నిపాతవత్॥

తా॥ రోగరహితుడై అపమృత్యువును గాంచెడివారినాడి సన్నిపాత నాడివలె నుండును.

దుష్టపిత్తనాడీలక్షణం

౧౬౪. దోషంవాతకఫం దుష్టంపిత్తం వహాతిదారుణం। పిత్తస్థానం విజానీయాత్ భేషజంతస్యకారయేత్॥

తా॥ ఎవనికి వాతశ్లేష్మనాడులు మిగుల నల్పంబుగను పిత్తనాడి యతిదారుణంబుగను, నడచుచుండునో అది దుష్టపిత్తమని యెఱింగి వైద్యుడు చికిత్సలను జేయవలెను.

సదోషవిదోషనాడీలక్షణం

౧౬౫. నాడీయథాకాలగతి స్త్రయాణాం ప్రకోపశాన్త్యాధిస్థితేవధూయః। వాతాదిదోషేచ భవేత్ప్రకోపా స్థూలాల్పగాశ్చిని యాన్తి తేస్యాత్॥

తా॥ నాడి మెల్లపుడు వాతపిత్తశ్లేష్మయుక్తముగ నుండును. మఱియు నది వాతాదిరోగయుక్తులందు ప్రకోపముగను, నిరోగంబున శాంతముగను వుండి యథాగతిని వాతాదిదోషంబున రోగయుక్తమై ప్రకోపంబుగను, పాశాదిబద్ధంబున, స్థూలంబుగను అల్పంబుగను చలించుచుండును.

జ్వరదాహసన్నిపాతనాడీలక్షణము

౧౬౬. ప్లవప్రబల తాంయాతి జ్వరదాహాభిభూతయోః సన్నిపాతకరూపేణ భవంతిసర్వవేదనాః॥

తా॥ మిగులతాపజ్వరయుక్తముగురోగికి నాడి సన్నిపాతతుల్యముగ మిక్కిలి చపటపడియుచు నడచుచుండుటయేగాక పయి నుదహరింపబడిన చిహ్నములు గల జ్వరము దాహము గలుగును. ఇవి సన్నిపాతంబున బుట్టుసేని అనేకబాధలను గలిగించును.

జ్వరప్రకోపనాడీలక్షణం

౧౬౭. జ్వరప్రకోపె ధమనీ సోష్మావేగవతీ భవేత్॥

తా॥ జ్వరప్రకోపమున నాడి యుష్ణముగను అతి త్వరితముగను నడచుచుండును.

మలాజీర్ణశ్లేష్మదోషనాడీలక్షణం

౧౬౮. మలాజీర్ణేన నితరాం స్పందనం పరికీర్తితం। నాడీతంతు సమామంతా శీతలాశ్లేష్మదోషజా॥

తా॥ నాడిమలాధిక్యము అజీర్ణము వీట్లయందు మందముగ నడచును. మఱియు శ్లేష్మాధిక్యమున శీతలముగను తంతువువలెను నాడి మందముగ నడచుచుండును.

### వాతపైత్య శ్లేష్మవాతనాడీలక్షణము

౧౧౯. చంచలాతరళాస్థూలా కఠినావాతపిత్తజా। ఈషచ్చప్రదృశ్యతేసూక్ష్మామందాస్యా శ్లేష్మవాతజా॥

తా॥ వాతపైత్యరోగమున చంచలముగను, ప్రకాశముగను, స్థూలముగను, కఠినముగను నడచును. శ్లేష్మవాతనాడి కొంచెముష్ణముగను, మందముగను నడచును.

### అల్పశ్లేష్మప్రబలవాతోష్ణ వాతాది నాడీలక్షణము

౧౨౦. నిరంతరం ఖరరూక్షంమందశ్లేష్మాతివాతిలా। రూక్షవాతభవేత్తస్య నాడీస్యాత్పిండసన్నిభా॥

తా॥ అల్పశ్లేష్మరోగమునను, ప్రబలవాతరోగమునను నాడి సర్వదా తీక్షణముగను, ఉష్ణముగను నడచుచుండును. ఉష్ణవాతమందలి నాడి పిండమువలె నడచుచుండును.

### సహజవాతతీవ్రవాతాది నాడీలక్షణం

౧౨౧. సౌమ్యాసూక్ష్మా స్థిరామందా నాడీ సహజవాతజా।
స్థూలాచకఠినాశీఘ్రా స్ఫురదతె తీవ్రమారుతే॥

తా॥ ఎవనికినాడిసౌమ్యముగను, సూక్ష్మముగను, స్థిరముగను, మందముగను, స్థూలముగను, శీఘ్రముగను నడచునో అది తీవ్రవాతమని ఎఱుంగవలెను.

### దుష్టరక్త నాడీలక్షణము

౧౨౨. మధ్యేకరేవహేంనాడీ యదిసంతప్తితాధ్రువం। తదానూనం మనుష్యాణాం రుధిరాపూరితామలాః॥

తా॥ దుష్టరక్తము శరీరమున వృద్ధిపొందెనేని యారక్తము పక్వామాశయమునందలి మలముతో జేరి సంతాపయుక్తమై మధ్యహస్తంబున చలించుచుండును.

### భూతజ్వర ఏకాహికజ్వర విషమజ్వర నాడీలక్షణము

౧౨౩. భూతజ్వరే సేక ఇవనాడివేగా ధావంతినద్యోహియథాబ్ధిగామా॥ ఏకాహికేనక్వచన ప్రమాదితక్షణానుగా విషమజ్వరేణ॥

తా॥ నాడిభూతజ్వరమున సముద్రమునకుఁబోవు నదీ ప్రవాహ ములవలె అతిశీఘ్రముగను, ఏకాహికజ్వర విషమజ్వరములందు కొంత కాలమతి శీఘ్రముగను నిలచినిలచియు నడచుచుండును.

### ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థిక జ్వరనాడీలక్షణము

౧౨౪. ద్వితీయ్యకే వాథతృతీయ్యే తుర్యయోగచ్ఛ నితప్తాభ్ర మివక్రమేణ॥

తా॥ ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థికజ్వరములందు అత్యుష్ణ ముతోఁ గూడి తున్మెదవలె నడచుచుండును.

### అజీర్ణ నాడీలక్షణము

౧౨౫. అజీర్ణేతు భవేన్నాడీ కఠినాపరిపోజడా। ప్రసన్నాతు భృతాశుద్ధాత్వరితాచ ప్రవర్తతే॥

తా॥ అజీర్ణరోగమున కఠినంబుగను, సర్వత్ర జడముగను, త్వ రితముగను, అశుద్ధముగను, వేగముగను నడచుచుండును.

### మందాగ్ని నాడీలక్షణము

౧౨౬. మందాగ్నైక్షీణతాయాతి నాడీహంసా కృతి స్తథా॥

తా॥ మందాగ్నిగలవాని నాడి క్షీణమయి మెల్లగ హంసవలె నడచుచుండును.

### దీప్తాగ్ని నాడీలక్షణము

౧౨౭. లఘ్వీవహతిదీప్తాగ్నేత స్తథా వేగవత్స్మృతా॥

తా॥ నాడిదీప్తాగ్నిగలవానియందు లఘువుగను త్వరితముగను నడచును.

### అగ్నిమాంద్యము గ్రహణ్యాదినాడీలక్షణము

౧౨౮. పాదేచహంసగమనాకరె మండూకసంప్లవా। తస్మాగ్నే ర్మందతా దేహేత్వథవాగ్రహణీగతః॥

తా॥ నాడి అగ్నిమాంద్యమునను, గ్రహణిరోగమునను, పాదం బున హంసవలెను, కరంబున కప్పవలెను చలించుచుండును.



శ్రీనివాస ధన్వంతరీయములోని

# నాడీ పరిజ్ఞానము



## ద్రావిడవైద్య నాడీపరీక్షాప్రకరణము

### గురునాడిగుణము

౧౭౯. గురునాడివాతగతియందు జలగవలె తిరిగిరాగా వాయువధికమగును. దగ్గు, నవ్వ, గజ్జియు గలుగును. దేహమువాడును గురునాడి పైత్యగతియందు కూర్మమువలె నడచిన జ్వరమువచ్చును, నోట నీరూరును. చెమటపుట్టును. శ్లేష్మమున గురునాడి సింహమువలెనుండ దన్నికలుగును. గురునాడి శ్లేష్మము నణగియుండ అసాధ్యమరణమునకు గుర్తులుకలుగును. గురునాడి జీర్ణించియుండ కడుపుయియాద్చును. నొప్పియెత్తును. చేతులు కాళ్ళు వాచును. గురునాడి ప్రక్కనుండిన శ్లేష్మ మెదురుగ పరుగెత్తును. స్థిరముగ నిలచియుండిన వాతపిత్తములు రెండును చేయును. గురునాడి వెనుకకుతీసిన అసాధ్యములు గలుగును. అదేస్వస్థానమునతీవ్రముగనుండిన మరణముగలుగును.

### నాడులు క్రిందుమీదుగ మించిపోవువిధము

౧౮౦. చంద్రుడు వాతనాడి సూర్యుడు పిత్తనాడి సుషియందు శ్లేష్మనాడి గురువారమున శ్లేష్మనాడి శని, మంగళ, ఆదివారములలో పిత్తనాడి సోమ, బుధ, శుక్రవారములలో వాతనాడియు మించిపోవును.

### నాడిచేష్టలు

౧౮౧. వాతనాడియందు వాతము ప్రకోపించిన దేహమునొచ్చును, వాచును, చిక్కును. అన్నమందిష్టముండదు. వాతనాడియందు పైత్యమునుగమించిన పిచ్చిమాటలాడును, కాళ్ళు చల్లబడును, వాచును. వాతనాడిలో శ్లేష్మమునుగమించిన దేహమువాచును, యీడ్చును, తలనొప్పిగలుగును. గుణములు వేర్వేరుగానుండును. దేహ

ము నెల్లగనగును. ఆహారము సరిపడదు. దినదినక్రమముగ వాపు అధికమగును.

౧౮౨. పైత్యనాడియందు పిత్తప్రకోపమైన మైకము, మరపు మాటలాడుట, అశక్తి, బడలిక, దేహము శుష్కించి వాపును గలుగును. పైత్యవాతమైన ఒడలుపీకుట, మంట, గొంతు ఎండుకొనిపోవుట మొదలగు గుణములు గలుగును. పిత్తశ్లేష్మమయిన కఫపుజ్వరము కలవరింపుమాటలు, కనులుమండుట, పచ్చబడుట మొదలగు గుణములు కలుగును.

౧౮౩. శ్లేష్మవాతమయిన నరములు యీడ్చుట, కంఠము సన్నమగుట, ఊర్ధ్వదృష్టి, కలవరింతలు, కఫము, దాహమును గలుగును. శ్లేష్మపైత్యమున తలనొప్పి, చెముడు, నోరుతీపు, జన్నియు గలుగును. శ్లేష్మప్రకోపమయిన జన్నిశైత్యములు గలుగును. జీవము పోవును.

## మరణమునకు గుర్తులు

౧౮౪. రెండుదినములు పింగళ యనునాడి నాసికలో కుడివయపున బారిన మూడుసంవత్సరములకు మృతిబొందును. మూడుదినము లెడమపార్శ్వమున బారిన రెండేండ్లకు చనిపోవును. పదిదినములు రెండువయిపులను బారిన ఒకనెలలో మరణమునొందును.

నాసికవిడచి నోటినుండి మాత్రము శ్వాసముబారిన మూడు దినములలో అత్యురోగము (మేహరోగము) చే దేహము చిక్కిపిమ్మట వాచిన ఒకనెలలో మరణము గలుగును.

పిత్తరోగముచే చిక్కిన దేహము వాచిన ఆరుమాసములలో చచ్చును. శ్లేష్మము జలప్రవాహమువలె వేగముగ నడచుచుండిన మరుచటిదినమునందే మరణము. పిత్తము చెదరిపారిన మూడు దినములలో మరణమొందును.

వాతము చెదరిపారిన యెనిమిది దినములలో మృతినొందును. వాతపిత్తములు రెండును చేరి స్థానములుమారిన నయిదు దినములకు మరణము. వాతపిత్తశ్లేష్మములు మూడును చేరి స్థానముతప్పి చెదరి పోయిన నలువది దినములలో మరణము. మూడును ఒకటిగాచేరి నలు కీసుతోకవలె మొగిరిన యొకదినములో మరణము.

వాతపిత్తశ్లేష్మము లొకటిగా చేరి తేలుతోకవలె యాడి యొ డవలె నడచిన ఒక నెలకు మరణము.

నాడిహీనముగా నడచిన యొకనెలలో నవ్యముగ యెప్పటిగలికి రాకున్న పదిమాసములలో మరణము.

శ్లేష్మనాడి యశ్వగమనమువలె తీవ్రముగా నడచిన ఒక నెలలో మరణము. ప్రాతఃకాలమున శ్లేష్మనాడియు మధ్యాహ్నమున పిత్తనాడియు సాయంకాలమున వాతనాడియు మితిమించినడచిన నాలుగయిదు దినములలో మరణము. శ్లేష్మనాడి నెమలివలెను, జలగవలెను తీవ్రముగా నడచిన నేడవదినమున మృత్యువునొందును. రోగియొక్క నోటియెంగిలి సమీపమునబడిన మరణము.

ఒక తెల్లని వస్త్రమును నేతిలో తడిపి కాలికట్టుకు చుట్టి మూడుం ముప్పాతిక గడియలుంచి విప్పిచూడగ వాతనాడియెగిరి తగ్గినట్లున్న, పామువలె మెల్లగా నడచినను యిరువదిరెండు దినములలో మరణము. తీవ్రముగా నడచిన తొమ్మిదిదినములలో మరణము. జలగవలె నడచిన మూడుదినములలో మరణము. తంతివలె చుట్టినట్లు గానబడిన ఆదినమే మరణము. ప్రక్కనుండి పరుగెత్తిన ముప్పది దినములలో మరణము గలుగు నని తెలుసుకొనవలెను.

నాడి కీటకమువలె ప్రాకినను కాకచేసినను. దూదివలె మృదువుగానుండినను, హంసవలె నడచినను, వ్యాధికుదురు నని గ్రహించవలెను.

ఎడమయరికాలు చల్లనై కుడియరికాలు ఉష్ణము శీతము రెండును గల గియు ఉండిన పది దినములలో మరణము. రెండుపాదములు ఒకేరీతి గా శీతలముగానుండి మధ్యప్రదేశము వేడిమిగలిగి నాసికయందు శ్వాస ము అధికముగా గలిగి బడలికయు ఎక్కిళ్ళును కలిగి దేహము చల్ల నయి కన్నులు చీకటిక్రమ్మిన మూడవదినమున మరణము. కంఠము తల మెడకు లోభాగము చల్లనై కన్నులు నీలవర్ణమై గొంతులో కఫముతట్టిన మూడుదినములలో మరణముగల్గును. చేయినాడియు, మణికట్టు పల్లము చల్లనై అరికాలు కాకతోగూడి గొంతు కరకర మనిన అయిదవదినమున మరణము. రెండుతొడలును అరికాళ్ళును చల్లనై రెండుచెవులు మోతబెట్టిన రెండవదినమున మరణము.

కుడియరికాలు వెచ్చనై చెమటపుట్టి దేహమంతయు కాకగా నుండినను కనురెప్పలు, ముఖము, ఎడమయరచేయి వెచ్చనై ఉచ్ఛ్వి (ఉచ్ఛ్వాసము) చల్లనైనను కుడివైపు ముక్కును అరికాలును యెడ మప్రక్క నాసికను తోమునపుడు ఎర్రనైనను దేహమాద్యంతము కాకగా నుండినను వ్యాధి కుదురును.

కనుబొమలు, నాసిక, చెవులు, ఉచ్ఛ్వాసము, అరికాళ్లు, అరి చేతులు తెల్లనై పాదములు చల్లనైన అయిదు గడియలలో మరణము వాతపైత్యములడగి శ్లేష్మమధికమై దేహము తెల్లనై రొమ్ము చల్ల నైన తొంబదిఘడియలలో మరణము. శ్లేష్మనాడి యధికమై వెంటనే తగ్గిన రెండుఘడియలలో మరణము. పిత్తమణగి వాతశ్లేష్మము లధి కమై కంఠమున కఫమణగి చిక్కి, కన్నుకమ్మినీరు వడచిన అయిదుఘ డియలలో మరణము. ముఖమువాడి నరములు తెలియునట్లు పచ్చని రంగుగాకను, కమ్మవేగమున నరములు చల్లనై హీనముగా పంచభూత ము లుడిగిన నరవకయుని పండ్లుకొఱికి వణుకుపుట్టి వాతపిత్తశ్లేష్మములు క్షీణవలె కొట్టుకొనిన సద్యోమరణమని గ్రహించవలెను.

## మరణచిహ్నములు

౧౮౫. వాతపిత్తశ్లేష్మములు తెగబడిన (అరణయమున) వలుకీ సుతోకవలె త్రుళ్ళును. దేహము చల్లనై యుండును. చేతులతో దేహమును తడవిచూచును. మనుష్యుల నపేక్షగాచూచును. శ్వాస మధికమగును. రెండు ప్రక్కలు యీడ్చును. గొంతులో కఫము చేరి గుఱ్ఱుగుఱ్ఱు మనును. కంట నీరుజారుచుండును. పైత్యపుమాటలాడు చుండును. ఒకలు విక్కును. నాసిక వాడును. చెవులగిలబడును. కండ్లు దంతములు నల్లబడును. కఫ మధికమై యుంటలుంటలుగా వచ్చుచుండును. కండ్లుత్రిప్పును. జీవుడు అల్లాడును.

## మరణచిహ్నములలోని యవస్థలు

౧౮౬. మొదటియవస్థ పీడగకంపుకొట్టును. రెండవయవస్థ మంచిమాటలాడును. మూడవయవస్థ చిత్తము చెలించును. నాల్గవ యవస్థ చిక్కిపై శ్వాసము తీసిపోవును. అయిదవయవస్థ ఊర్ధ్వ దృష్టిగలుగును. ఆరవయవస్థ చల్లనగును. యేడవయవస్థ అన్నము గోరును, యెనిమిదవయవస్థ కండ్లుచీకటులు గ్రమ్మును. తొమ్మిదవది దేహము తెల్లనగును. పదియవయవస్థమరణము. ఈవిధముగ మరణా వస్థలను గ్రహించవలెను.

## వాతము, పిత్తము, శ్లేష్మము వీటినిగురుతులచే తెలియుపద్ధతి

౧౮౭. మలముచే వాతగుణమును, మూత్రముచే పిత్తగుణ మును, బిందువుచే శ్లేష్మగుణమును, తెలిసికొనవలెను.

## దేహమందలి వాతపిత్త శ్లేష్మస్థానములు.

౧౮౮. పాదమునుండి నాభివరకువాతము, నాభినుండి కంఠము వరకు శ్లేష్మము. కంఠమునుండి శిరస్సువరకు పిత్తమునియు నాడీస్థాన ముల నెఱుంగవలెను.

## వాతపిత్తశ్లేష్మముల గుణములు రూపములు రుచులు

### మొదలగు నిర్ణయములు

౧౮౯. వాతం వాయువు, పులుసు, చల్లన, రూపం నలుపు, నీలం,
పిత్తం, చేదు, కాంతి, ఘందం, రూపం పసుపు, పచ్చ,
శ్లేష్మం ఉప్పు, తీపు, చెమట, రూపం, తెలుపు,
వాత మధికమైన పులుసు నాలుకయందు కలుగును.
పిత్త మధికమైన చేదు నాలుకయందు కలుగును.
శ్లేష్మాధికమైన నాలుకయందు తీపిగలుగును.
దేహము చల్లనైన వాతము, ఉష్ణమైన పిత్తము, చెమ
ఉపట్టిన శ్లేష్మము.

## వాతపిత్తశ్లేష్మకాలములు

### మతాంతరము

౧౯౦. తెల్లవారి పది ఘడియలు వాతము, మధ్యాహ్నము పది ఘడియలు పిత్తము అస్తమానమున పది ఘడియలు శ్లేష్మము ను నడచును. మనుజునికి పూర్ణాయుః ప్రమాణము ౧౨౦ సంవత్సరములు అందు నలుపదివర్షములు వాతము, నలుపది మొదలు యెనుబది వర్షములవరకు పైత్యకాలము. యెనుబది మొదలు నూటయిరువది వర్షములవరకు శ్లేష్మవాతము.

## నాడిచూచుటకు మాసదినవార నిర్ణయము

౧౯౧. చిత్రవైయాసి మాసములలో నుదయకాలమున నాడిని చూడవలెను. ఆని అడి అల్పిసి కార్తికమాసములలో మధ్యాహ్నమున చూడవలెను. మార్గళి తైమాశి మాసములలో అస్తమానమున చూడవలెను. పంగుని అవణి పెరటాసి మాసములలో రాత్రియందు

వాడిని పరీక్షించవలెను. ఇట్లు చూచిన నాడీ పరిశుద్ధముగా తెలియబడును.

## ద్రావిడమాసములకు మేషాదిసంక్రమణ సంబంధవివరణము

౧౯౨. అరవమాసములు మేషసంక్రమణము మొదలుగా సౌరమానరీతిని లెక్కింపబడును. మేషము ౧ వ తేది యనగా చిత్తిరామాసము యిదే చైత్రము. ఈవిధమున వైకాసి = వృషభము = వైశాఖము అని, మిధునము—జ్యేష్ఠము—ఆని—కర్కాటకము ఆషాఢము, ఆవణి సింహము—శ్రావణము. పెరటాసి—కన్యా—భాద్రపదము. అప్పిసి—తులా—ఆశ్వయుజము—కార్తిక—వృశ్చికము—కార్తికము—మార్గళి—ధనుర్మాసము—మార్గశిరము, తై—మకరము—పుష్యము—మాసి—కుంభము—మాఘము—పంగుని—మీనము—ఫాల్గునము ఈవిధమున మాసనామముల నెఱుంగవలెను.

## లంఘనప్రకరణము

౧౯౩. లంఘనములు చేయింపవలసిన తత్వములు మూడు విధములు.

౧. వాతజ్వరము, అజీర్ణజ్వరములు గలవారికి వాతనాడి హరించి పైత్యనాడి స్ఫుటముగ గానవచ్చువరకు వ్యాధియొక్క బలాబలముల ననుసరించి లంఘనములు తప్పక చేయించవలెను. 'అజీర్ణే లంఘనం పథ్యం' అను లోకోక్తి యందరికిని తెలిసినవిషయమే. ఇట్టిఅజీర్ణరోగులకు శుష్కోపవాసము చేయించవలెను. అజీర్ణరోగము శ్లేష్మాధిక్యమువలనను అపక్వపదార్థభక్షణము వలనను, రక్తము క్షీణించుటవలనను, దాహణమేహము, శుక్లనష్టమువలనను రక్తమందలి యుష్ణము తగ్గి అజీర్ణరోగమును గలిగించును.

పిత్తజ్వరముగలవారికి లఘుభోజనము చేయించవలెను.

మహాజ్వరముగలవారికి ప్రథమయామమున గంజి త్రాగించవలెను.

లంఘనము లందఱి విషయమున చేయించకూడదు.

౧౨౪. అతిసారవ్యాధిపీడితులు, గర్భవతులు, వృద్ధులు, శిశువులు శుష్కించిన శరీరముగలవారు దూరమునడచి యలసినవారు, నేత్రరోగులు క్షయరోగులు, కుష్ఠురోగులు, గ్రహణీరోగపీడితులు, దారుణమహారోగులు, మహాపైత్యరోగులును లంఘనములకర్హులు కారు. ఎట్టి విషరోగపీడితులైనను దారుణమగు మహాదౌషధములను సేవించి రోగవిముక్తులై అత్యుష్ణము శరీరమంతయు వ్యాపించిన పిదప నొక క్షణమైనను లంఘనముంచరాదు. వెంటనే వైద్యుని యాజ్ఞప్రకారము రోగికి పథ్యమిడవలెను. అట్లు చేయకుండిన రోగవిముక్తులైనను అకాలమృత్యువాపన్నమై మహాదౌషధ ప్రయోగము వలన విముక్తబడియు, అన్నము తినని కారణమున గూడ తిరుగ మృత్యువునోట బడుట నిశ్చయము, ఈవిషయమున కొందరు పామరులు ఆయువున్న యెడల అన్నము పెట్టకుండిన చావరనియు మరికొన్ని దినములు బాధ నొందుదురనియు వాదనలు చేయుదురు. వైద్య దట్టివారిమాటలను మొదలనే పరీక్షించి వైద్యము చేయుటమానవలెను.

జ్వరవిషయమున కర్మవిపాకాది గ్రంథాభిప్రాయము

౧౨౫. బ్రాహ్మణేతరులకు బ్రాహ్మణద్రవ్యాపహారము క్షత్రియేతరులకు క్షత్రియద్రవ్యాపహారము, వైశ్యేతరులకు వైశ్యద్రవ్యాపహారము, సర్వజనులకు దేవద్రవ్యాపహారము, గురుద్రవ్యాపహారము, రాజద్రవ్యాపహారము, ప్రభుద్రవ్యాపహారముల వలన సామాన్యజ్వరము, మహాజ్వరము, రుద్రజ్వరము, వైష్ణవజ్వరము, మొదలగు జ్వరములు పుట్టుచుండును. రుద్రజ్వరమునకు రుద్రజపమున్ను మహాజ్వరమునకు మహారుద్రజపమునున్ను రుద్రజ్వరమునందు మహారుద్రము

నున్ను, వైష్ణవద్వారమునకు విష్ణుసహస్రనామజపమునున్ను, పారాయణమును, అష్టద్వారములకు నారాయణాష్టాక్షరిజపమున్ను, విష్ణుసహస్రనామజపమునున్ను చేయించి శక్త్యనుసారముగ అన్నదానమును చేయించిన జ్వరవిముక్తులగుదురు.

## జ్యోతిషశాస్త్రాభిప్రాయము

౧౯౩. సూర్యుడు తనకు నీచరాసియైన తులారాశియందుండగ బుట్టినవానికి సూర్యదశామధ్యమున నేత్రపీడ, జ్వరము, శిరోరోగము, సంకటములు, ఉగ్రపీడ, కుష్ఠువు, మొదలగు రోగములు కలుగును. క్షీణచంద్రునిదశయందునను, నీచనుపొంది వృశ్చికమందుండు చంద్రుని దశామధ్యమందును ఇటులనే కలుగును. కుజదశయందును ప్రతికుజాంతరమందును అతనికి నీచక్షేత్రమగు కర్కటకరాసియందున్నప్పుడును కుష్ఠులు మేహవ్రణములు మశూచి మొదలగునుష్ణరోగములచే పీడింపబడును. సప్తమమునగాని అష్టమమునగాని శనిగురువులు చేరియుండిన రక్తకాసరోగము కలుగును. వారితో సూర్యుడు కూడియుండిన క్షయరోగము గలుగును. శనిలగ్నమందుండిన జాతకుడు వాతరోగియగును. చంద్రుడుగాని బుధుడుగాని లగ్నాధిపతియై రాహుకేతుయుక్తుడయిన శనిచే చూడబడెనేని జాతకుడు శ్వేతకుష్ఠురోగమువలన పీడింపబడును. ఈయవస్థ మిథున కర్కట కన్యాలగ్నములకు మాత్రము గలుగును. లగ్నాధిపతితో బుధుడుగాని, కుజుడుగాని కూడి కన్యామకరములందున్నను లగ్నాధిపతి రాహుయుక్తుడై బుధునిచేత చూడబడినను జాతకునికి అపనరోగము గలుగును. షష్ఠాధిపతిగాని, సప్తమాధిపతిగాని వ్యయాధిపతితో కూడి శనిచేత చూడబడెనేని జాతకునికి మూత్రకృచ్ఛ్రరోగము కలుగును. షష్ఠమమున శనికుజరాహువులు అథవాలగ్నమున గురురాహువులును చేరియుండిన జాతకునికి వారి దశాభుక్తికాలమున అండరోగము సంభవించును. ఇవి మొదలగు

జ్యోతిషశాస్త్రాభిప్రాయములవలనను కర్మవిపాకాది గ్రంథములందు చెప్పబడినరీతిని ప్రారబ్ధము ఆగామి సంచిత సుకృత దుష్కృత కర్మఫలప్రాప్తి వశమునను జనుల కాయారోగములు గలుగుచుండును గాన, ఆయా రోగములు తమతమ రోగశాంతికొరకు భగవత్ప్రార్థనము గ్రహశాంతులును అన్నదానాది పూర్వకముగ పాపపరిహారమును తప్పక చేసికొనవలెను. అట్లు వారివారి యిష్టదైవములను ప్రార్థనము చేయుచుండుట ముఖ్యకర్తవ్యము. బ్రాహ్మణాది సర్వజనులకును సర్వాంతర్యామి స్వరూపుడును, సర్వవేద ప్రతిపాద్యుడును, సర్వదేవతాస్వరూపుడును అగు నారాయణుని (శరీరే జర్ఝరీభూతే వ్యాధిగ్రస్తే కళేబరే। ఔషధం జాహ్నవీతోయం వైద్యో నారాయణో హరిః): అను ప్రకారము ఔషధసేవ కాలమునను తదితరకాలములందును నారాయణుని తత్స్వరూపుడగు వైద్యుని ధ్యానించుచుండవలెను. ప్రారబ్ధవశమున గలుగు రోగములు కర్మ పరిపక్వముకానిది ఔషధసేవవలన నివారణ మగునా యని కొందరు ప్రశ్నచేయుదురు. భగవన్నామోచ్చారణమున్ను ఔషధములు గూడ నలంఘ్యనీయములని యెల్లవారికిని తెలియును. గాన నీ రెండుపాయములవలనను తప్పక వ్యాధి నివారణమగును. అని నిశ్చయముగ నొక్కి చెప్పగలము. అయిన నీలోకమున నిట్టి దృఢ భక్తి తాత్పర్యములు గలిగి ఔషధసేవ లేకయే యుండువారలు కోటి కొకరయిన నుండరని నొక్కి చెప్పగలము. గనుక ప్రాణులు పాంచభౌతిక శరీరములను ధరించియుండునంతవరకు ప్రారబ్ధ ఆగామిసంచిత పాపఫలరూపముగ సంచరించు రోగము నివారణార్థము చికిత్సలను చేయుచునేయుండవలెను.

ధన్వంతరి, అశ్వినీదేవతలు, సిద్ధులు, యోగులు, విరాగులు మొదలగు మహాత్ములు నానావిధములగు ఓషధులయొక్కయు రసాదులయొక్కయు గుణములను తమ యోగపరిశుద్ధ జ్ఞానమువలనను

స్వానుభవము వలనను కనిపెట్టి చెప్పిన ఔషధ యోగములవలన నెట్టి రోగములనైనను నివృత్తి చేయుకలిగియుండునని విశ్వాసముంచవలెను. వైద్యుఁడు నారాయణస్వరూపుఁడనియు సర్వవిధములను గుణసంపత్తి గలవాఁడనియు గురించుకొని ఔషధసేవ చేయుచున్న సర్వరోగములును నివారణ మగును.

## వైద్య లక్షణము

౧౯౭. అగణితసాంవత్సరిక సద్గుణహీనస్తు జగతియోమంత్రీ॥ శాస్త్రవిహీనో వైద్యస్త్రయః పురుషాభవంతి యమదూతాః॥ అను విధమున సిద్ధాంతము తెలియక పంచాంగము చెప్పు జ్యోతిష్కుఁడు రాజకీయ వ్యవహారములను తెలియని మంత్రి శాస్త్రమెరుగని వైద్యుఁడు యీముగ్గురు ప్రజలపాలిటి యమదూత లగుదురు. అనునట్లు వైద్యుఁ డనువాఁడు వైద్యశాస్త్రమును బాగుగ జదివి యందలి రహస్యార్థములను తత్వములను విశదముగ నెరింగినవాఁడును చిరకాలము నుండి వైద్యమం దనుభవముగలవాఁడుగను అహింస, యింద్రియ నిగ్రహము, సర్వభూత దయాళుత్వము, క్షమ, భగవజ్ఞానము, తపస్సు, భగవధ్యానము, సత్యవాక్యము, శరణాగత రక్షణమం దభిరుచి, శుచిత్వము, దంభ రాహిత్యము, అలోభము యెట్టిసూవదలయందును ధైర్యము మొదలగు సుగుణములను గలిగి యుండవలెను. బాల జ్యోతిషము వృద్ధవైద్యము అనుకీతిని వంశపారంపర్యముగ వైద్యసంప్రదాయము గలిగి యుండవలెను. అట్లుగాకున్న తనకాలమున వైద్యము చేయుచుండిన తా ననేకశాస్త్రములను పెద్దలవద్ద చదివి అందలి రహస్యార్థ సంప్రదాయములను సంగ్రహించియు నానావిధ రోగ తత్వములను చూచియు ఆరోగములకు తనకు తెలిసియున్నట్టియు వైద్యశిఖామణులవలన గ్రహించినట్టియు యోగములచే నివారణము చేయుచుండవలెను. ఇట్టి సుద్గుణసంపదలచే నలంకరింపబడియుండు వైద్యుఁడు తాను

చేయు ఔషధములను దేశకాలతత్వముల ననుసరించి పూర్వగ్రంథము లలో వ్రాయబడిన యోగములు కొన్ని దేశతత్వము, కాలతత్వము, దేహతత్వములు భేదించియుండుటచే పని చేయజాలవు. అట్టి సమయమున నాడీనిదానము దేశములోని శీతోష్ణస్థిత్యాదుల పరిశోధనమును బాగుగా నాలోచించి నూతనౌషధములనుగూడ కల్పించవలెను. ఔషధములందు చేర్పబడు భస్మాదులను పరిశుద్ధముగ శుద్ధులనుచేసి భసితములను చేసియు ఓషధులను నిజమయినవానినిగా గ్రహించి స్వచ్ఛముయినవాటిని చేర్చి బాగుగ మర్దించి సిద్ధపరచుకొనవలెను. అట్టి ఔషధములను అనుపానయుక్తముగ సేవించవలెను. ఔషధము సిద్ధమైన వేగమే ప్రథమమున నాల్గుభాగములను జేసి అందు మొదటిభాగము ధర్మార్థముగను. రెండవది ధన్వంతరిభాగముగను తీసి దానిని రోగుల నుండి గేవిధమైన యుపకార మపేక్షింపక వాడవలెను. మిగత రెండు భాగములకును ప్రత్యుపకార మపేక్షించుట యుక్తము. నూతనౌషధములను కల్పించుటలో దేశకాలనాడితత్వములనుబట్టి మార్చుటకు కారణమేమన. ఒక్కొక దేశమున కొంతకాలమునకు ముందుముందు భూతత్వము కొన్నికారణముల ననుసరించి శీతోష్ణ స్థితులు భేదించును. ఉదాహరణము ఒకదేశమున నొకనది ప్రవహించుచుండును. ఆ ప్రవాహోదకము మిట్టపల్లములకు సమానముగ ప్రవహింపకుండుటచే ఆనదికి ఉన్నతప్రదేశమున ఆనకట్టు కట్టి ప్రవాహోదకమును సంవత్సరమంతయు నిల్వ చేసి కాలువల మార్గమున సంవత్సరము పొడుగునను పయి నిల్వనీటిని పారించి సర్వకాలములందును సస్యములను పండించుచుందురు. అందువలన భూమి నిస్సారమై పంటలు తగ్గుచుండును. ధాన్యములకు బలము తగ్గియుండును. ఓషధులు నిస్సారమగును. ఆ దేశమం దుండు జనుల దేహతత్వములుగూడ క్రమక్రమముగ భేదించును. ఆయురారోగ్యములుతగ్గిపోవును. ధనముమాత్రమధికముగును. ఇందుకు

దృష్టాంతముగ కాలువనీటివలన పంటధాన్యాదులయొక్కయు, పశ్వాదుల పాడియొక్కయు, సహారాధారప్రదేశమందలి పంటదినుసులయొక్కయు పశ్వాదులపాడియొక్కయు గుణముల నాలోచించిన విశదమగును. ఒకమనుజుడు తనదేశమును విడచి యనేకదేశములను తిరిగి ఆయాదేశములలోని యన్నపానాదులను భుజించియు శీతోష్ణాదుల ననుభవించియు తిరుగ కొంతకాలమునకు తన స్వదేశమును చేరినపిమ్మట యతని దేహతత్వము మారియుండును. భూమితత్వముకూడ అనేకతావుల ననేకవిధములుగ మారియుండును. ఇదియు నిందువలన విశదమగును. ఒకదేశమున అందుండు జనులకు సర్వసౌఖ్యముల నిచ్చుచుండియు గొంతకాలమునకు శీతోష్ణముల మార్పువలన నాదేశతత్వము భేదించి అందలి జనులకు సర్వవిధాసౌఖ్యముల కాకరమై యుండును. మనుజుల తత్వములుగూడ వైద్యశాస్త్రప్రకారముగ ఏడుసంవత్సరముల కొకసారి మారుచుండునని హిందూవైద్యశిఖామణులును పదిసంవత్సరములకొకసారి మారుచుండునని పాశ్చాత్యవైద్యశిఖామణులును ఒప్పుకొనియున్నారు. గాన దేశకాల నాడీతత్వముల ననుసరించి వైద్యులు ఔషధములకు అనుపానములను మార్చియు రోగులకు వాడుచుండవలెను. గాని పూర్వగ్రంధములలో వ్రాయబడిన ఔషధయోగముల ననుసరించి చేయుబోవు ఔషధములలో చేర్చబడు రసపాషాణాదులకును, గ్రంధేణములకును, మూలికలకును శాస్త్రయుక్తమైన శుద్ధులను నిష్కళంకమగునట్లు చేయవలెను. తూనికలును, కొలతలును హెచ్చుతగ్గులు లేకుండగ చేర్చవలెను. మర్దనలు శాస్త్రోక్తముగ చేయించవలెను. పయి యంశములలో నెద్దానియందు హెచ్చుతగ్గులు సంభవించినను ఆయాఔషధములు శాస్త్రోక్తగుణములను జేయక పోవుటయె గాక వాటిని సేవించిన రోగులకు రోగములు నివారణము కాకుండుటయెగాక క్రొత్తరోగములును విపరీతగుణములను గలిగించి

అధికబాధలను పొందించును. అందువలననే రోగపీడితులలో, కొందరు వైద్యులని పేరుపెట్టుకొని వచ్చుడు వారి యౌషధములను గ్రహించుటను సందేహించి బాధలను పొందుచునే యుందురు.

“ఆస్నారాపృథివీ నిరౌషధి లతాని చామహాత్మ్యం గతాః” అను ప్రమాణోక్తి ననుసరించి పయి కారణములకు మూలమగును. వయిద్యగన ప్రజలపాలిటి దైవముగను ఆపద్బాంధవుడుగను యెంచబడవలెను.

వైద్యునికి వైద్యశాస్త్రమందలి పూర్వపరిచయమే గాక జ్యోతిషశాస్త్రమందును ఇతరశాస్త్రములందును పరిచయము కొంతవరకు గలిగియుండవలెను.

ఎందుకన, వైద్యుడు తాను చికిత్సచేయబోవు రోగి ఆజ్వరము ఏతిథి నక్షత్రములయం దంకురించినదో తెలిసికొనవలెను. యాతిథి నక్షత్ర వారములలో వంకురించిన జ్వరములకు గాలపరిమితి గలిగియుండును. రోగియొక్క జాతకము ననుసరించియు జాతకము లేకున్న నామనక్షత్రము ననుసరించియు గోచారఫలమును తెలుసుకొని రోగసమయములం దేయేగ్రహముల సంచారమునుబట్టి యేరోగ మంకురించినదో దానిని గ్రహించి ఆయాగ్రహనక్షత్ర తిథివారముల కధిదేవతలకు శాంతులను చేయించి రోగములకు సమయానుసారముగ చికిత్సలను చేయవచ్చును. ఇంతియగాక తాను జేయబోవు ఔషధముయొక్క నామనక్షత్రమును గుర్తెరిగి దానికి తగిన తిథి వార నక్షత్ర యోగ కరణము మొదలగు పంచాంగరీతిని చేసి సిద్ధమైనపిమ్మట తన యిష్టదైవమును ధన్వంతరిని బూజించి యుపయోగపరచిన నది యవ్యాహతముగ శాస్త్రమున జెప్పబడినరీతిని పనిజేయును. యేయేరోగమం దేయేపథ్యమును జేయవలయునో ఆయారోగములందు తగినపథ్యములను చేయించుచుండవలెను. “రోగికిపథ్యం మనిషికిసత్యం” అను లోకోక్తి ననుసరించి పథ్యము చేయకుండిన రోగము కుదురకుండుటయే గాక

క్రొత్తవికారగుణములుగూడ రోగులకు గల్గును. శిఖనువిడిచి కొంబు పట్టవలసివచ్చును. రోగగుణము ననుసరించి యనుపానములను పథ్యపదార్థములనుగూడ మార్పుచేయుచుండవలెను.

కర్మవిపాకము మొదలగు గ్రంథములను చదివి వానియందలి యథార్థమును తెలిసికొనుటకును, పూర్వోత్తర సందర్భములను స్వయముగ విచారించుటకునుతగిన ఆంధ్రగీర్వాణ భాషాపరిజ్ఞానముకుగూడ వైద్యునికి కలిగి యుండవలెను.

ఇప్పటికిని ముఖ్యసాధనము అమృతహస్తియు, సత్యవాక్ప్రమాణతయు, నాడినిబట్టియు, రోగియొక్క బాధలనుబట్టియు, ముఖవర్చస్సు మొదలగు అష్టవిధస్థాన స్వరూపములనుబట్టియు రోగమును నిర్ధారణచేయుటకు తగిన చాతుర్యమును గలిగియుండవలెను. ద్వేషములేనివాడుగను, మనస్సంతోషము గలవాడుగను, సర్వవిధవైద్యశాస్త్రపారగుడుగను, అనుభవముగలవాడుగను, వాక్పటుత్వము, కుశలబుద్ధియు, శాంతమును గలిగి మూడుతత్వముల నెఱిగినవాడుగను, జితేంద్రియుడుగను, భగవద్ధ్యానరతుడుగను వైద్యుడుండవలెను. "అల్పశ్చకాలో బహవశ్చవిఘ్నాః" యనునట్లు ఆయు వల్పము. శాస్త్రములపారములు. విఘ్నముల కంతములేదు గాన ఒకమనుజునికే సర్వశాస్త్రములను అభ్యసించుటకును, "మహామునీనాం మతయశ్చ భిన్నా" అందరుమునుల యభిప్రాయముల నైకకంఠ్యముచేయుటకును లోకమందనేకులగు సాధువులుందురు గాన వారి నందరిని దేశాంతరములకు బోయి వారి నాశ్రయించి వారియనుగ్రహమును సంపాదించుటకును, "ధనమూల మిదం జగత్" అను వాక్యసరణిని ధన వ్యయముచేసి దేశాటనము చేయుటకును, సంసారసంబంధమైన యిక్కట్టులకు లోనై యుండుటచే అందరికిని వలనుపడదు. గాన వైద్యశాస్త్రపారగు లగు

మహాత్ముల నాశ్రయించి అనుగ్రహమును సంపాదించి శాస్త్రమును సంప్రదాయములను గ్రహించి పై ప్రకారమున వైద్యుడు తన వృత్తిని పరమార్థమును బాపాడుకొనిన వైద్యజీవనమును చేయుచుండుట మంచిది.

ఔషధము చేయుటకును, సేవించుటకును శుభాశుభ దినముల నిర్ణయము

౧౯౮. ఉత్తమం గురువారంచ మధ్యమం భృగు భాస్కరా! శని మంగళయోర్మృత్యుః నవమధ్యం బుధసోమయోః॥

తా॥ గురువారము ఔషధమును జేయుటకుగాని సేవించుటకు గాని శ్రేష్ఠతమము. శుక్రవార ఆదివారములు శ్రేష్ఠతరము అనగా మధ్యమము. బుధవార సోమవారములు అధమము. అనగా సాధారణము. శని మంగళవారములు మృత్యుప్రదము. "మహాత్యాగదినం ప్రాప్తైస్మరేణా భగవాన్ హరిః" యనునట్లు రోగులకు ప్రాణోత్క్రమణకాలమున భగవధ్యానమును జేయుచు ఔషధములను ఇచ్చుటయేగాని కాలనియమము, స్థలనియమము, జాతినియమము, లూహించ నవసరము లేదు.

జ్వరవిషయమై శుభాశుభములను తెలియజేయు చక్రము

ఈచక్రమునందు వరుసగానున్న తొమ్మిది నక్షత్రములలో జ్వరంవచ్చిన నక్షత్రమున్ను, సూర్యసంచారనక్షత్రమున్ను, జన్మనక్షత్రమున్ను కలిసియున్న యెడల ఆరోగి మృతుడగును.

శ్లో. ఆర్ద్రాది చంద్రభాంతంచ మూలాం త్రిష్ఠతిమధ్యమే! రవీందుజన భాన్యేక రఖాయాంచేన్న జీవతి॥

| | | | | |
|---|---|---|---|---|
| ఆర్ద్రా | పుబ్బ | ఉత్తర | అనూరాధ | జ్యేష్ఠ |
| పునర్వసు | మఖ | హస్త | విశాఖ | మూల |
| పుష్యమి | ఆశ్లేష | చిత్త | స్వాతి | పూర్వాషాఢ |
| ధనిష్ఠ | శతభిషం | భరణి | కృత్తిక | |

శ్రవణం పూర్వాభాద్ర అశ్విని రోహిణి
ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర రేవతి మృగశిర

ఇతి శ్రీమద్ధన్వంతరి ప్రసాద సమాసాదితాయుర్వేద రహస్య రచనా విశారద
శ్రీమన్నారి తిరుమలాంబలాచార్య్యాగ్రసర మాసభూపస్యాస్వయోధిమా వేదాం
తాధికృత వేంకటరామాచార్య్య పౌత్ర శ్రీమద్వేంకటాచార్య్య పుత్ర
కాశ్యపగోత్ర రమాసతీసమాన లక్ష్మీవరసమాంబా గర్భ
వార్ధి శుక్తిముక్తాయమాన శ్రీనివాసాఖ్యాభిధాన
ప్రణీతంబైన శ్రీనివాస ధన్వంతరీయంబున
ప్రథమభాగాంతర్గత నాడీనిదాన
ప్రకరణము. శ్రీ శ్రీ శ్రీ.

సంపూర్ణము.



## యంత్రసహాయమున దేహమునందలి యుష్ణమును కనుగొనుట

ఇట్టియంత్రమును "థర్మామేటరు" అని ఇంగ్లీషువారందురు. ఈథర్మామేటరు గాజుగొట్టమువలెనుండును. లోపల పాదరసముండును. దేహమునందలి యుష్ణస్థితి ననుసరించి ఈపాదరసము పైకి లేచుచుండును. క్రిందకుదిగుచుండును. ఈథర్మామేటరు పయిని 95, 100, 105, 110 అను సంకేతములుండును. వీనిని డిగ్రీలందురు. డిగ్రీలను పాయింట్లు క్రింద విభజించబడును. ఒకనిశరీరోష్ణస్థితి కనుగొనుటకుముందు కుడి చేతితో నీథర్మామేటరును పట్టుకొని నెమ్మదిగ జాడించినయెడల నందు లోని పాదరసము 95 వ డిగ్రీవద్దకు దిగును.

ఆరోగ్యవంతుని దేహమున నుష్ణం 98 డిగ్రీల నాలుగుపాయింట్లు. నోటియందు 99—5 డిగ్రీలు. రక్తముయొక్క యుష్ణస్థితి 100 డిగ్రీలు. 99—6 డిగ్రీలకు హెచ్చినగాని, 97—5 డిగ్రీలకు తగ్గినగాని నిశ్చయ

ముగ వ్యాధిని లక్షణము ఉష్ణస్థితితగ్గి ధాతుశోషమునగాని, రక్తక్షయమున గాని, దీర్ఘవ్యాధినిగాని యగును. ఉష్ణస్థితి హెచ్చినయెడల జ్వరాదుల వలన నగును.

థర్మామేటరు ఉపయోగించునపుడు 98—4 డిగ్రీలలో నుండు నట్లు చూడవలెను. రోగిచేతులు చల్లగాను, వెచ్చగాను నాయాకాలాముల ననుసరించియుండును గాన చేతిలో థర్మామేట రెవ్వడును పెట్టి పరీక్షింపఁదగదు. చంకలోనుంచుట మంచిది. చంకబాగుగా తుడిచి పాదరసమున్న అడుగుభాగమును చంకలో పెట్టవలెను. భుజము నొక్కి పట్టవలయును. థర్మామేటరునకు చర్మస్పర్శ బాగుగ దగలవలెను. 3 మొదలు 5 నిముసములవరకును పెట్టవలెను. తరువాత థర్మామేటరునుతీసి పాదరస మెంతవరకు బ్రాకునో చూడవలెను. అప్పుడుచూచు నాతఁడు తన చేతిని పాదరసమున్న భాగమునను తగులనీయగూడదు. ఉపయోగించుట మైనతోడనే కార్బాలికు సబ్బునీళ్ళతో థర్మామేటరును శుభ్రముగ కడుగవలెను.

ఉదయమున, సాయంతనమున నెనిమిది గంటలకు దేహస్థితి థర్మామేటరుతోఁ బరిశీలించవలెను.
పెద్దవాండ్ర దేహస్థితికన్న చంటిపిల్లల దెక్కువ యుష్ణముగ నుండును. ఆవిషయమయి గమనించవలెను.

### నాడి, శ్వాస, శరీరోష్ణస్థితి పరస్పరసంబంధము.

స్వతః మనుష్యున కుండవలసిన యుష్ణముకంటె నొక డిగ్రీ యెక్కువగనున్నయెడల నిముషమునకు సుమారు పదిసార్లు యెక్కువగ నాడికొట్టుకొనును. మునుపటికంటె రెండుమూడుసార్లు శ్వాస మధికముగనుండును. యీవిషయమై ప్రత్యేకముగ నొకగ్రంథమున రచించుచున్నారము గాన నిక్కడ విశేషించి వ్రాయలేదు.

